# వైశ్యప్రబోధిని

తెలుగు మాసపత్రిక



జూన్

# ఉత్తర భారత యాత్రలు

| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,000 |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | [illegible] |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | [illegible] |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | [illegible],300 |

Fare includes complimentary Dormitory accommodation and [illegible] Guide charges. Tariff for Tour No.4, is inclusive of food also enroute, [illegible] We are running LTC tours for Central Government employees in collaboration with [illegible]TDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact [illegible] for advance reservations

మీరు ఢిల్లీ వచ్చినప్పుడు అధునాతన సౌకర్యములతో నిర్మించబడిన మా "హోటల్ సదరన్"లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని [illegible]/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిసెలు, [illegible], బూందీ, వెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

## Southern Travels/Hotel Southern

[illegible] సంస్థ

**8/2, Arya Samaj Road, WEA Karolbagh,**
**New Delhi - 110 005.**
**(Phones : 5722210 (6 Lines); 5739508, 5782932)**

**Our branches**

1. Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones 223658, 227233)
2. Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones 2267040, 2262633)
3. Hotel Howrah Complex, Opp Madras Central Railway Station, Madras - 600 003 (Phones 564864, 555253)
4. No 10, Swarnalok Complex, Opp Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada 520 002 (Phones 32227, 66624)
5. Pavan Palace, Ground Floor, Opp T S R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016 (Phone 545565, 541099)

With the best compliments from

✆ : Offi : 20993
20744
Resi : 20538
Fact : 20655

# REVATHI PULVERISERS

Manufacturers of
**INSECTICIDES AND PESTICIDES**

**Factory :**
**DUPADU ( R.S.)**
Kurnool - Bangalore Road,
Kurnool ( Tq.) Kurnool Dist.

**REGISTERED OFFICE :**
40/353, Gandhi Nagar,
KURNOOL (A.P.)

FOR
Quality and top branded
Insecticides and Pesticides
Remember
**REVATHI**
to Increase your harvest
with the best qualities
AND
Best Quality of Barytes
other Minerals.

V.P - A1

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2–2–21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6–3–609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19–5–1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/–లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/–లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి
అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి
ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్,
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్.

“ ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి ”

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**
✆ : 31, 64, 74.

Phones : 42729, 42730, 42731 Fax : 42730, STD : 08552.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జర్గుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు 11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్సడ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు 116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి

యన్ బి : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము

**పోలిశెట్టి సత్యనారాయణ** — **యక్కలి బాలరత్నం**

అధ్యక్షులు మరియు కార్యవర్గ సభ్యులు ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)

✤

**స్థాపితము**

1969

✤

**సంపుటి**

28

✤

**సంచిక**

10

✤

**జూన్- 1997**

✤



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి

✤

ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ - 24911, 25025.


సంపాదకీయం

# ఉన్నతమైంది మహాసభాధ్యక్ష పదవి

ఉమ్మడి మద్రాసురాష్ట్రములో ఏర్పడిన కుల సభల్లో ఆర్యవైశ్యమహాసభే మొట్టమొదట ఏర్పడిన కులసభ ౨౦వ శతాబ్ధి ప్రారంభము నుండే కొందరు విద్యాధికుల, లోకానుభవం గల పెద్దల ఆలోచనా ఫలితమే. ఈ సభ ఏర్పాటు ౧౯౦౮లో ఆర్యవైశ్య మహాసభ ఏర్పడింది అఖిలభారతజాతీయసభ ఆలోచన, కూడా ఇందుకు కొంత ప్రోత్సాహాన్ని ఇచ్చింది. స్వర్గీయ సుంకునారాయణశ్రేష్ఠి గారు ఈ మహాసభను స్థాపించుటకు మిక్కిలి కృషి చేశారు "అధ్యక్షులుగా కూడా ఆయనే వ్యవహరించారు. శ్రేష్ఠిగారు గుంటూరు వాస్తవ్యులు. వెంకటగిరి సంస్థానానికి దివానులు.

మహాసభ అధ్యక్షులుగా ఎవరు ఉండాలి? అనే అంశాన్ని ఆనాటి పెద్దలు అన్ని కోణాలలో ఆలోచించే వారు. ఈనాటిలాగా - ఈ వ్యక్తి ఎంత బాగా చందాలు వసూలుచేస్తాడు? ఈ వ్యక్తి మాకెంత వరకూ విధేయుడు. ఏ రాజకీయపక్షమునకు చెందిన వాడు? మా దండలకు లోటుకలుగకుండా ఎంతబాగా జాగ్రత్త వహిస్తాడు. ఇలా-ఇలాగా కొన్ని అంశాలకే పరిమితమై ఆలోచించేవారు కారు.

ఆనాటి వైశ్య పెద్దల దృష్టిలో మహాసభాధ్యక్షపదవి చాలా ఉన్నతమైంది. అందుకే వారంతా ఆనాడు ఎంతో జాగ్రత్తగా వ్యక్తిత్వ పరిశీలన చేసేవారు. అధ్యక్షపీఠాధిరోహణకు అవసరమైన వయస్సు ఈయనకున్నదా? వైశ్యసంఘ విషయములోనూ

వైశ్యజాతి విషయములోనూ - సంస్కృతి విషయములోనూ ఆయనకు గల అవగాహన ఏమిటి? ఆలోచనా తీరు ఏమిటి? అంతటి ఉన్నతపదవికి తగినట్లుగా హుందాగా మాట్లాడగలడా? ప్రవర్తనలో ఏపాటి ఔచిత్యం ఉంది ఏ వాతావరణంలో పెరిగారు? ఇలా-ఇలా ఎన్నోరీతులుగా ఆలోచించికానీ నిర్ణయించేవారుకారు

ఒక సమయంలో స్వర్గీయ తుంపూడిభగవంతంగుప్త గారే మహాసభాధ్యక్షపదవిని స్వీకరించుటకు సంసిద్ధులు కాలేదు. భదవంతంగుప్త గారు చరిత్రను బాగా అధ్యయనం చేసిన వారు సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో మహాపండితులు ఈ ఒక్క అంశమే చాలు మహాసభ పదవికి గల ఔన్నత్యాన్నీ, గొప్పదన్నాన్నీ బేరీజు వేసుకోడానికి.

" ఏ రాజకీయ పక్షానికీ చెందని వ్యక్తే సభాధ్యక్షుడుగా వుండాలి" అనే నియమాన్ని పెట్టుకొని, దాన్ని తూ.చ తప్పకుండా అనుసరించే వారు ఆనాటి మనపెద్దలు. మన పెద్దలంటే ఎవరనుకున్నారు! భగవంతంగుప్త, కొప్పరపుసుబ్బయ్యశ్రేష్ఠి, కొల్లా కాశీవిశ్వనాథం, యం.వి పాపన్నగుప్త, గ్రంథివెంకటగోపాలగుప్త, మోతేనారాయణరావు మెదలగువారలు. వీరంతా కూడా ఒక రాజకీయ సిద్ధాంతానికి కట్టుబడని వారు. వీరంతా ఎప్పడూ ఆలోచించింది వైశ్యజాతి సర్వతోముఖాభివృద్ధిని గురించేస్వార్థానికి ఆవంత గూడా ఆస్కారం లేకుండా ఆలోచించేవారు. ఇంతేకాదు ఆనాటివారు ఎన్నికలకు అవకాశం ఇచ్చేవారే కాదు. వైశ్యజాతి సంస్కృతి - సభ్యత - సాంప్రదాయము - గత వైభవము- వర్తమానకాల పరిస్థితులు - సాహిత్యములో గల అనుభవము - మాటలలో నిండుతనము - హుందాగా వ్యవహరించడమూ ఇత్యాదులు ఆనాటి మహాసభాధ్యక్షపదవికి కొలబద్దలు, ఈ మాటలు ఎవరినీ ఉద్ధేశించి వ్రాసినవికావు. నా యీ వాక్యాలలోని నిగ్గుతేల్చు కోవాలనుకున్నవారు 1906 నుండీ 1950 వరకు సాగిన ఆర్యవైశ్యమహాసభా చరిత్రను చూడవచ్చు. ఈ పత్రిక రజతోత్సవసంచిక" వైశ్యవైజయంతిక " లో ఇందుకు సంబంధించిన వ్యాసం ఉంది.

ఉదాహరణకు, మహాసభ ప్రప్రథమాధ్యక్షులు శ్రీ సుంకునారాయణ శ్రేష్ఠిగారు. వీరు వెంకటగిరి సంస్థానములో దివాను. మాటల్లో నిండుతనమూ ముఖములో సౌమ్యమూ - వేషభూషణాదుల్లో

హుందాతనము కలిగి - "చూడగానే నమస్కరించాలి" అను భావాన్ని కలిగించేవారు. మహోన్నతులు. 1910లో మద్రాసులో జరిగిన మహాసభకు అధ్యక్షులు స్వర్గీయ వేమూరితిరువేంగడత్తాసుశ్రేష్ఠి. ఆనందముద్రాక్షరశాలాధిపతులు .చక్కనిమాటకారి. సభ్యత, సాంప్రదాయం బాగా ఎరిగి మసలుకొనేవారు. 1911లో తిరిగి మద్రాసులోనే జరిగిన సభకు అధ్యక్షులు మార్కాపురం చెంగయ్యశ్రేష్ఠిగారు. అప్పటి మైసూరు రాష్ట్రములో డిప్యూటీకమీషనరుగా ఉండి పదవీవిరమణ చేసినవారు. 1914లో ఏలూరులో జరిగిన సభకు అగ్రాసనాధిపతులు చల్లాగురు స్వామిశ్రేష్ఠిగారు. వీరు ఆనాటి మద్రాసు రాష్ట్రఉన్నతన్యాయస్థానములో పేరుపొందిన న్యాయవాదులు. సమయస్ఫూర్తి కలిగినవారు. సందర్భ సహితంగా మాట్లాడేవారు. 1974 లో తిరిగి గుంటూరులో జరిగిన సభకు అధ్యక్షలు గ్రంధివెంకటగోపాలగుప్త గారు. కోయంబత్తూరు వాస్తవ్యులైన వీరు గొప్ప పండితులు. చక్కని పదాలతో సాహిత్య పరిమళాలను వెదజల్లుచూ మాట్లాడేవారు.

ఒక్కరేమిటి? ఆనాడు మహాసభాధ్యక్షపదవి నలంకరించిన వారెల్లరూ దిగ్గంతిసమానులే. ప్రతిభాధురంధరులే. సౌజన్యశీలురే. చక్కని, చిక్కని వ్యక్తిత్వంగలవారే. అందువల్లనే ఆర్యవైశ్యమహాసభ . ఘన చరిత్రను సంతరించుకోగలిగింది. ఆ చరిత్రను పెంచలేకపోయినా, దాని స్థాయిని కాపాడుకోడాన్ని గురించైనా ఆలోచించాల్సిన అవసరమూ, ఆవశ్యకతా, యీ తరం వైశ్యులపై గురుతరంగా ఉంది.

మహాసభాధ్యక్షపదవికై అర్హులు చాలి, ఎదురుచూస్తూ ఉన్నవారు ఆ పదవికి తాము ఎంతవరకూ అర్హులము? ఆ చరిత్రనూ ఎంతవరకూ కాపాడగలము? అని తులనాత్మకంగా పరిశీలించుకోవాలి. ఇప్పుడు మహాసభలో పలుకుబడి కలిగిన పెద్దలు కూడా వారి ఆలోచనలు ఇక ముందైనా యీ తీరులో సాగించాలి, అందుకే యీ సంపాదకీయము.

ఇప్పటి అధ్యక్షులు పదవి కొఱకు లక్షకుపైబడి ఖర్చు చేశారని వినికిడి. సత్యాసత్యాలేమైనా - డబ్బు బలంచూసి ఎత్తుకు పైఎత్తువేసీ పదవిని పొందాలనే భావాలు పలువురిలో కన్పిస్తున్నాయి. మహాసభ అధ్యక్షపదవికి తగిన వయస్సు తనకున్నదా! అని కూడా ఆలోచించడం లేదు. ఇవి చాలాప్రమాదకరమైనవి. మహాసభ స్థాయిని దిగజారుస్తాయి.

వైశ్యప్రబోధిని, జూన్ 1997

మహా పండితులు - బ్రాహ్మణ్యులు - గొప్ప సంస్కర్త

# ఆత్మూరి లక్ష్మి నరసింహా సోమయాజి

- పి. సంపాదకులు.



" త్రైవర్ణకులకే కాదు. చతుర్వర్ణాల వారికీ వేదం చదివే అర్హత ఉంది"- అంటూ ఎలుగెత్తి చెప్పిన అతి కొద్దిమంది పండితుల్లో తొలివరుసన లెక్కించదగ్గ వారు కీర్తిశేషులు ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజుల వారు. పిష్ట (పిండి) పశువుతో యజ్ఞము చేసిన ఏకైక వ్యక్తి శ్రీ సోమయాజి. కలియుగములో యజ్ఞము చేసిన ద్వితీయ వైశ్యుడు సోమయాజి. స్త్రీకి పునర్వివాహం చేయవచ్చు అంటూ అనేక ఆధారాలు చూపించి కందుకూరి వీరేశలింగం గారికి అండగా నిలిచి ఆయన చేపట్టిన వితంతూద్వావాహాల ఉద్యమానికి ప్రాణం పోసిన సంఘసంస్కర్త సోమయాజి.

సోమయాజిగారు మహాపండితులు. గొప్ప వక్తలు, మహానైష్ఠికులు, అద్భుత మేధావి. నాలుగు వేదాలను, ఉపనిషత్తులను, అరణ్యకాలను, సంహితలను క్షుణ్ణంగా చదివి తనలో జీర్ణించుకొన్న గొప్ప శాస్త్రవేత్త.

" కృషి ఉంటే మనిషి ఋషి అవుతాడు, మహాత్ముడు అవుతాడు" అను వాక్యాలకు సరియైన ఉదాహరణ సోమయాజి. "అర్థజ్ఞానం లేకుండా వేదాన్ని వల్లెవేయించడం కాక అర్థముతో కూడ వేదాన్ని నేర్పించాలి " - అంటూ ఈయన వంద సంవత్సరాలకు పూర్వమే ఇచ్చిన పిలుపు అప్పటి సంస్కృత పండితులను ఆలోచనా పరులను చేసింది. 1887వ సంవత్సరములో ఇప్పటి అనంతపురం జిల్లా గుత్తిపట్టణములో వీరు వేదాలపై ఉపన్యాసం ఇచ్చారు. ఆ సభకు ప్రముఖ ఆంగ్ల పండితులు మాక్సుముల్లర్ సహపాఠి నికాల్సన్ దొరగారు అధ్యక్షత వహించారు. దొరగారు అప్పుడు గుత్తిపట్టణములోని జూబ్లీ సంస్కృత పాఠశాలకు అధ్యక్షులుగా ఉండేవారు. 1889వ సంవత్సరం మార్చి నెల 9వ తేదీన అదే గుత్తిలోనే వేదముల వీరు మరో ఉపన్యాసం ఇచ్చారు. ఈ ఉపన్యాస సభకు యునైటెడ్ స్టేట్స్ ఆఫ్

అమెరికా నుండి వచ్చిన చార్లెస్ పావిలో అధ్యక్షత వహించారు. వేదాలపై వీరు ఇచ్చిన ఉపన్యాసాలు అనాటి హిందూ పండితులను, మేధావులనే కాక ఆంగ్లేయ పండితులను కూడ ఎంతగానో కర్షించాయి. అందుకే మాక్సుముల్లర్ పండితుడు సోమయాజుల వారితో వేదములకు అర్థము వ్రాయించమని ప్పటి కళింగదేశాధిపతి శ్రీ ఆనంద గజపతుల వారికి సలహా ఇచ్చాడు. అంతవరకు అర్థము తెలియని వేదమందలి అనేక శబ్దాలకు సోమయాజులు అర్థము చెప్పారు. బైబిలులోను, ఖురానులోనూ ఉన్న అనేక శబ్దాలకు, వేదములోని వాక్యాలకు గల సమన్వయాన్ని వివరించారు.

వేదమును ఈయన " మహర్షులు ఉపదేశించిన మంత్రము" అను అర్థములో మహర్షులు బోధించారని చెప్పాచూ, సోమయాజులవారు "ద్యౌపితా" అంటే ఏసుక్రీస్తు చెప్పినట్లు స్వర్గమందున్న మన తండ్రి అనే కానీ, స్వర్గము మన తండ్రి అని కాదని సమన్వయించారు.

సోమయాజులవారి వేదోపన్యాసాలను పరిశీలిస్తే ఆయన వేదాలను క్షుణ్ణంగా చదివి, అర్థము చేసుకొని వాటి అంతర్యం చెడకుండా అందలి విశేషాలనూ, విశిష్టతలనూ, అంతవరకూ అర్థము కాకుండా ఉన్న వేదములందలి పదాలకు అర్థమునూ చెప్పినట్లుగా విశదమవు తుంది. వేదములు యధాతథంగా అర్థము కావడం పరమేశ్వరుని సంకల్ప శక్తి చేతనే సాధ్యము అనేది వీరి అభిప్రాయం. వీరి వేదోపన్యాసాలను క్రోడీకరించి, కీ॥ శే ॥ గ్రంధి వెంకటసుబ్బరాయశర్మగారు తాను రచిం చిన శ్రీ లక్ష్మీనరసింహసోమయాజి జీవిత చరిత్రలో ముద్రించారు. ఈ పుస్తకం ఇప్పుడు శిధిలావస్థలో ఉంది. దీన్ని తిరిగి ముద్రించి భావితరాలకు భద్రపరచడము ఎంతైనా అవసరము.

సోమయాజులవారి వేదపాండిత్యము కేవలము ఉపన్యాసాలకే పరిమితము కాలేదు. దాన్ని గ్రంథస్థము కూడ చేశారు కృష్ణ యజుర్వేదాన్ని జ్ఞానార్థములోనూ కర్మార్థములోనూ వ్రాశారు. సూక్తార్థ ప్రకాశికకూ, భగవద్గీతకూ గూడార్థాన్ని రచించారు. వీటిలో ఏది ముద్రితము? ముద్రితము కానిదేది అను విషయము తెలియుటలేదు, ఆ కాలములో శృంగేరీ పీఠాధిపతులుగా ఉన్న శంకరాచార్యుల వారికీ, శివగంగ శంకరాచార్యుల వారికీ తాను రచించిన భగవద్గీత గూడార్థాన్ని తన

సుధారసవాగ్వైఖరితో వినిపించగా, ఆ యతీంద్రులు శ్రీవారి వాగ్వైఖరీ ప్రాభావానికీ, బ్రాహ్మవేతృత్వానికి మెచ్చి "సద్భావుడు," "బ్రాహ్మణ్యుడు," "వేదోక్త స్థాపనా కుశలుడు" అని ప్రశంసాపత్రాన్ని ఇచ్చారు. సోమయాజులు గారు కృష్ణయజుర్వేదాన్ని జ్ఞానార్థ, కర్మార్థాలలో వ్రాస్తూ " ఇషేత్వా" అను మంత్రానికి అందలి "ఇషే" అను పదానికి జ్ఞానపరంగా జ్ఞానము కొఱకు త్వా నిన్ను ప్రార్థిస్తున్నాను అనీ, కర్మపరంగా "ఇషే" (దేవతలకు దధిరూపమైన ) అన్నముకొఱకు త్వా......ఓ మోదుగుకొమ్మా! నిన్ను (కోయుచున్నాను) అని అర్థము చెప్పారు. భూసూక్తములోని గౌః గమనశీలః అను విద్యారణ్యులవారి భాష్యాన్ని తీసుకొని " భూమి తిరుగుచున్నది" అని సిద్ధాంతీకరిస్తూ ఇంగ్లీషువారికన్నా అనేకవేల సంవత్సరాలకు పూర్వమే మన మహర్షులు ఈ విషయాన్ని చెప్పారని కూడా సోమయాజులుగారు వెల్లడించారు. వీరు వేదసాహిత్యములో తమకుగల విశేష పరిశీలన ఆధారంగా "వేదవృక్షము"ను బందరులో స్థాపించారు. సోమయాజుల వారు ఈ వేదవృక్షాన్ని అనుదినము అర్చిస్తూ ధూప దీప నైవేధ్యాలను సమర్పించే వారు. 1988వ సంవత్సరము డిసెంబరు వరకూ ఈ వేదవృక్షము బందరులోని శ్రీ లక్ష్మీ నరసింహసోమయాజివైశ్యసమాజ భవన ములో ఉండేది. వంగవీటి మోహన రంగారావు గారి హత్య సందర్భంగా జరిగిన దహనకాండలో ఆ సమాజ భవనము కాలిపోగా, అందలి వేదవృక్షము కూడ దహనమైంది. విజయవాడలోని శ్రీ భ్రమరాంభామల్లేశ్వర ఆంధ్ర గ్రంథాలయములో ఈ వేద వృక్షము యొక్క ఛాయాచిత్రము ఉంది. స్వర్గీయ గ్రంధివెంకటసుబ్బరాయ శర్మ గారు వ్రాసిన వీరి జీవిత చరిత్ర గ్రంథంలో కూడ ఆ వేద వృక్షముయొక్క రూపము ఉంది. వీరి చరిత్రను పద్య కావ్యంగా రచించిన బ్రహ్మశ్రీ పాణ్యెం లక్ష్మీనరసింహ కవిగారు ఈ వేదవృక్షాన్ని ఈ క్రింద విధంగా వర్ణించారు.

సీ ॥ ప్రాగ్దిశ రక్తవర్ణముల నొకకొమ్మ
ఋగ్వేద సంస్థితి నెరుక పరుప
దక్షిణమ్మున హరిద్రపువన్నె నొకకొమ్మ
య య్యజుశ్రుతి తెలియంగ జేయ
పశ్చిమదిశ నాకుపచ్చ వర్ణపు కొమ్మ
సామవేద స్థితి జ్ఞప్తిదేగ
నుత్తరంబున ధూమ్రయుక్తమౌ
నొక కొమ్మ
యల యధర్వము నున్కి దెలుపు
చుండ
మీద సోమను వర్ణమ్ము మిగుల నదియ
ప్రణవ వర్ణంబు మూలంపు క్రమము
దెలుప
వెలయు ప్రణవానుగత వేదముల
సమిష్టి
వృక్షరూపంబుచే జూడ
విదితమగును.

సోమయాజులు సంస్కృతములోనే కాక ఆంధ్రము లోనూ, ఆంగ్లములోనూ, జర్మను భాషలోనూ అనితర ప్రతిభా వంతులు. బహుళ పరిశ్రమ చేసినవారు. వైదిక సాహిత్యముపై అయన చేసిన కృషినీ, వృత్తి పరంగా అయన చూపిన దక్షతనూ, నిజాయితీనీ గమనించిన ఆనాటి ఆంగ్ల

దొరలు సోమయాజుల వారికి అనేక ప్రశంసా పతకాలను బహూకరించారు. సోమయాజులవారు రాజాస్థానాలకు వెళ్ళేటప్పుడూ ఉన్నత పదువుల్లో ఉన్న వారిని సందర్శించేందుకు వెళ్ళేటప్పుడూ వీటిని ధరించే వెళ్ళేవారు. వీరు యం.ఏ. పరీక్షలో ప్రథముడుగా ఉత్తీర్ణులైన సందర్భాన్ని పురస్కరించుకొని 1875వ సంవత్సరములో కలకత్తాలో జరిగిన "కాన్వకేషన్ "కు వెళ్ళారు. అప్పుడు మన దేశాన్ని విక్టోరియా మహారాణి పరిపాలి స్తూండేది. ఆ రాణి కొడుకు "ఎడ్వర్డ్ యువరాజు" ఆ కాన్వకేషన్‌లో పాల్గొన్నారు. అనేక మంది రాజప్రతినిధులు, ఉన్నతో ద్యోగులు, లక్ష్మీపుత్రులు, కూడ ఆ సభకు అరుదెంచారు. సోమయాజులవారు తనకు లభించిన సమస్త సన్మాన పతక ఉపేతంగా స్వర్ణచిత్రిత కవచ ధారణతో గంభీరంగా ఆ సభలో పాల్గొన్నారు. గంభీరభావ సముద్రమైన ఆయన మూర్తి ఎడ్వర్డ్ ప్రభువుకు ఆనందాన్ని కలి గించింది. పరమాదరణతో ఆహ్వానించి అర్ధాసనాన్ని ఇచ్చి తమ ప్రక్కన కూర్చోబెట్టుకొన్నారు. అది చూచిన ఆ సభలోని వారంతా ఆశ్చర్యపోయారు.

వైశ్యులకు వేదార్హత లేదు - అనే భావము ఆ కాలపు విప్రుల్లో బలంగా ఉండేది. ఈ భావాన్ని వారినుండి పొగొట్టు టకు వీరికన్నా ముందువారూ, తొలి తెలుగు నైఘంటికులూ అయిన స్వర్గీయ మామిడి వెంకటార్యులు ఎంతో కృషి చేశారు. ఆ భావాన్ని పొగొట్టుటకు సోమయాజులు కూడ ఎంతో శ్రమ పడాల్సి వచ్చింది, "ఐరోపా దేశములో ఒక మేధావి కూడ పుట్టలేదు. మతస్థాపకులెల్లరూ ఆసియా దేశము లోనే అవతరించారు"- అంటూ వీరు అనేక సభల్లో చెప్పారు. క్రైస్తవ, మహమ్మదీయ మైత్రికి కృషిచేశారు. వేదమత వ్యాప్తికి శ్రమించారు. ఇహపర సౌఖ్యాల కొఱకు కులాలతో నిమిత్తము లేకుండా వేదాన్ని పఠించాల్సిందే అని అనేక సారులు వచించారు. సోమయాజులవారు "వేదార్థ ప్రకాశిక ' అను ఒక మాసపత్రికను 1901లో ప్రారంభించారు. భగవద్గీత గూఢార్థము, ఋగ్వేదము, యజుర్వేదము, ఉపనిషత్తులు మొదలగునవి ఈ పత్రికలో స్వర, అర్థ వివరాలతో ప్రకటించబడ్డాయి. అందువల్ల ఆనాటి పండితలోక ప్రశంసలు ఈ పత్రికానిర్వహణ ఫలితంగా వీరికి లభించాయి కాశీ లోని పండితులు ఈ పత్రికను చూచి, ఎంతో సంతోషించి, ఒక ప్రశంసాపత్రాన్ని సంస్కృతములో వ్రాసి వీరికి పంపారు. అందులో "శ్రీ సంవత్సరం ౧౯౫౭ మీం మాఘకృష్ణ ప్రతిపత్ భృగౌ మహామహోపాధ్యాయ" అనే శ్లోకముంది. 1901 వరకూ కాశీ ప్రాంతములో విక్రమశకము వాడుకలో ఉంది అని చెప్పే చారిత్రకపరిశోధకులు తమ వాదానికి ఉపస్ఫోరకంగా పై పత్రికలోని పై ఆధారాన్ని చూపిస్తారు. ఉద్యోగరీత్యా చిత్తూరుకు 1899లో బదిలీ కాబడిన సోమయాజుల వారు అచ్చట తన యందు భక్తి శ్రద్ధలు గల కోటసుబ్బయ్యగుప్త గారిని ప్రోత్సహించి "కన్యకాపరమేశ్వరి" అను పత్రికను స్థాపింపచేశారు. పోషణ లేక ఆ పత్రిక అచిరకాలంలోనే ఆగిపోయింది. బహుశా ఇదే తొలి వైశ్యపత్రిక కావచ్చు. కులదేవతయగు శ్రీ కన్యకా పరమేశ్వరీ

పేరుతో ప్రారంభమైన ఈ పత్రిక అచిరకాలంలోనే ఆగిపోవుటను గురించి "వైశ్యులకు పత్రిక చదివే భాగ్యమున్న యెడల వైశ్యపత్రిక ఏల అంతరించును? ప్రతి పట్టణములోనూ కన్యకాపరమేశ్వరీ దేవాలయాలు ఉన్నవి. ఒక్కొక్క దేవాలయము నుండి సంవత్సరానికి నూరు రూపాయలు ఇచ్చినా ఇట్టి పత్రికలు, గ్రంథములు అనేకములు పోషింపబడ గలవు, ఇట్టి ఉద్యమము తెలిపినను అచ్చట ఏమీ తెలియని వంశపారంపర్యపు హక్కు కలిగిన పెద్దలు కొందఱు జేరియుందురు. దేశకాల పాత్రములను ఎఱుగని ఆ పెద్దలకు ఇవి చెవున పడవు" అని స్వర్గీయ గ్రంధివెంకటసుబ్బరాయశర్మ తమ ఆవేదనను తెలిపారు. ఈ పరిస్థితి ఇప్పటికీ మారలేదు. ఇది ఒక దురదృష్టము.

వైశ్యులు కూడ ద్విజులే. ద్విజులకు వేదార్హత ఉంది. అయినా యజ్ఞము చేసిన వైశ్యులు ఇంత వరకు ముగ్గురే కన్పిస్తున్నారు. మొదటివారు దానపతి. ఇతని కథ భారతంలోని కర్ణపర్వములో ఉంది. రెండవ వారు పెనుగొండను పాలించిన కుసుమగుప్తుడు. ఈయన సంతానాపేక్షతో "పుత్రకామేష్టి" యజ్ఞాన్ని చేశారు. మూడవ వారు మన ఈ ఆత్మూరి వారే. అహింసాపరమోధర్మః అని వేదవాక్యం. యజ్ఞములో పశువును చంపడం ఆ వేదవాక్యానికి విరుద్ధము. అందువల్ల మన ఈ ఆత్మూరి వారు పిష్ట(పిండి) పశువుతో యజ్ఞము చేశారు. యజ్ఞము ఈశ్వరునికి ప్రీతికరము. దేవఋణము, ఋషి ఋణము, పితృఋణము, మానవ ఋణము అని ఋణములు నాలుగు రకాలు. మానవుడు ఈ నాలుగు ఋణాల నుండీ విముక్తుడు కావాల్సిందే. యజ్ఞము చేయుట వల్ల దేవ ఋణమును, తపస్సు వల్ల ఋషిఋణమును, శ్రాద్ధకర్మలు చేయుట వల్ల పితృ ఋణమును, ధనార్జన చేయుటవల్ల మానవ ఋణమును మానవుడు తీర్చుకొంటాడు. అయితే యజ్ఞమును చేయుటకు "దీక్షితుడు" కావడం ఒక అర్హత. ఆధానమును చేయుటవల్ల దీక్షితుడు కావచ్చు. 1892 వ సంవత్సరము ఖరనామ సంవత్సర మాఘ మాసములో విజయ నగరములో తన నివాసములోనే మన ఆత్మూరి వారు ఆధానము చేసి "దీక్షితుడు" అయ్యాడు. కుహనాపండితులు, అసూయాగ్రస్తులు అయిన కొందరు బ్రాహ్మణ పండితులు, వీరు ఆధానమును చేయుటకు ఆక్షేపణలు తెలిపినా సహృదయులైన కొందరు బ్రాహ్మణ పండితులు ఆధానము చేయుటలో వీరికి సహకరించారు. ఆ తరువాత 1897లో మనయాజి "అగ్నిష్టోమము" అను యజ్ఞాన్ని చేశారు. 1896లో వీరు ఇప్పటి కర్నూలు జిల్లా నంద్యాలకు డిస్ట్రిక్టు మునసబుగా వచ్చారు. మహానంది నంద్యాలకు దగ్గరలో ఉన్న పుణ్యక్షేత్రము. సోమయాజిగారు ఆక్షేత్రాన్ని సందర్శించి అచ్చట నందీశ్వరుని నమక చమకములతో అభిషేకించి, బిల్వముతో అర్చించారు. ఆహ్లాదకరమైన అచ్చటి వాతావరణము, జలవనరులు, వృక్షసంపద యజ్ఞము చేయు అనుకూలముగా కనిపించాయి. అందువల్ల అక్కడే అగ్నిష్టోమాన్ని చేయాలనుకున్నారు. ఆ విషయము తెలిపిన బందరు పట్టణ

వైశ్యులు తమ పట్టణముననే యజ్ఞము చేయమనీ, అందుకు అన్ని విధాలా సహకరిస్తామనీ ఆహ్వానించారు. వారికోరిక మేరకు వీరు 1897వ సంవత్సరం హేవళంబినామ సంవత్సర వైశాఖ శు ౫ లు బందరులో అగ్నిష్టోమాన్ని చేశారు. వైశాఖ శు ౫ లు శుక్రవారంతో ప్రారంభమైన ఈ యజ్ఞ కార్యక్రమము షష్టాహ్నిక దీక్షతో ఆరురోజులు జరిగి శు ౧౦ న జరిగిన అవభృధస్నానము, శాలాప్రవేశముతో ముగిసింది. శనగపల్లి రామస్వామిగుప్తాది 18మంది వైశ్యులు, గొర్తిసుబ్బావధానులు మొదలగు 18 మంది బ్రాహ్మణులు ఋత్విక్కులుగా ఉండి ఈ యజ్ఞ కార్యక్రమములో వీరికి సహకరించారు. వైశ్యుడు యజ్ఞము చేయుటా? అని ఆగ్రహించిన కొందరు దుర్మార్గ బ్రాహ్మణ పండితులు వీరి యజ్ఞానికి భంగము కలిగించాలని వరుణదేవుని ప్రార్థించి వర్షమును కురిపించారు. సోమయాజిగారు అందుకు బెదరక స్థిరచిత్తులై యజ్ఞమే విష్ణువై యుండగా పర్జన్యుడు యజ్ఞమును ఎట్లు విఘ్నమొనర్చునో చూస్తానని ఈశ్వరధ్యానము చేయగా, యజ్ఞవాటికకు కొంత దూరంలో మాత్రమే వర్షము కురిసింది. కాని యజ్ఞవాటికపై ఒక చినుకుకూడ పడలేదు. అది చూచిన ప్రతిపక్షవిప్రులు పరాభవముతో తలలు వంచుకొన్నారు. దాసు శ్రీ రాములు గారను సహృదయుడగు ఒక బ్రాహ్మణ వేద పండితుడు శ్రీ యాజిగారికి ఈ క్రతు ఎంతో సహకరించారు. ఈ క్రతువును చేయుటవల్ల లక్ష్మీ నృసింహార్యులు "యాజి "అయ్యారు.

వాస్తవానికి ఆరోజు వర్షం కురవడం కొందరు బ్రాహ్మణ పండితులు చేసిన వరుణ ప్రార్థన ప్రభావముకాదు. యజ్ఞానంతరము వర్షము కురవడం ఒక శుభసూచకము. "యజ్ఞఫలం సువృష్టి" అని శాస్త్ర వాక్యము ఇదే సంవత్సరము ఆత్మూరి వారు కర్నూలులో వర్షపశువును బట్టారు యజ్ఞానంతరము, అదే సంవత్సరములో చేయవలసిన ఒక వైదిక కార్యక్రమాన్ని వర్షపశువును పట్టడం అంటారు. 1899లో చిత్తూరు డిస్ట్రిక్టు మునసబుగా ఉన్నప్పుడు మన యీయాజి సావిత్రీ చైనమును చేశారు. "సావిత్రీ చైనము' అనేది కూడ ఒక యజ్ఞవిధానమే

సోమయాజిగారికి ఈశ్వరధ్యానము మీద విశ్వాసం ఎక్కువ. ఈయనకు ఏ విధముగు విపత్తు వచ్చినా, ఆపద వచ్చినా, అడ్డంకులు ఎదురైనా వాటిని తొలగించుకొనుటకు పరమేశ్వర్య ప్రార్థన చేసేవారు. శ్రీసూక్త, పురుష సూక్తాలను సభక్తితో, సస్వరంతో చదివేవారు. 1864లో అంటే ఈయన పదకొండు ఏండ్ల ప్రాయములో ఉన్నప్పుడు రక్తాక్షినామ సంవత్సరం కార్తీకమాసములో ఒక పెద్ద ఉప్పెన వచ్చి, వీరి జన్మస్థలమైన "నూజివీడు "పట్టణాన్ని ముంచేయ నుండగా వీరు ఈశ్వరధ్యానము చేసి ఈ పట్టణవాసులకు ఉప్పెనవల్ల ముప్పు లేకుండా చేశారు .

స్త్రీపునర్వివాహ ఉద్యమానికి కందుకూరి వీరేశలింగం గారిని ప్రోత్సహించిందీ, సన్నద్ధులను చేసిందీ, అండగా నిలిచిందీ మన సోమయాజుల వారే. ఒకసారి వివాహం జరిగిన స్త్రీకి తిరిగి-వివాహం

చేయడము తగదనీ, శాస్త్రములు అంగీకరించవనీ ఆనాటి బ్రాహ్మణ్యము గగ్గోలు చేస్తూ కందుకూరి వారి పై దండెత్తి రాగా ఈయన అపుగా నిలబడడమే గాక "స్త్రీకి పునర్వివాహము చేయడము శాస్త్ర సమ్మతమే" అంటూ అనేక ఆధారాలతో నిరూపించి, వారి నోర్లను మూయించారు. స్త్రీ పునర్వివాహాన్ని ఆక్షేపించిన శ్రీ విరూపాక్ష శంకరస్వాముల నిరంకుశత్వాన్ని ఎదిరించి మద్రాసు హైకోర్టు ద్వారా రూ.200/-లు జుల్మానా వేయించారు. తాను పట్టిన స్త్రీపునర్వివాహ ఉద్యమసాఫల్యతకు సోమయాజులు తనకు ఎంతగా సహకరించిదీ, ఏవిధంగా ప్రోత్సాహించిందీ కూడ కందుకూరి వీరేశ లింగం గారు తమ స్వీయ చరిత్రలో స్పష్టంగా వ్రాసుకొన్నారు. ఆయన ఈ విషయంగా తన స్వీయ చరిత్రలో వ్రాసుకొన్న విషయాలు పరిశీలిస్తే సోమయాజుల వారి సహకారం అందకుంటే స్త్రీ పునర్వివాహ ఉద్యమంలో కందుకూరి వారు సఫలీకృతులు కాలేరు కూడ కానీ స్త్రీ పునర్వివాహ ఉద్యమాన్ని గురించి చెప్పేవారు ఆ ఘనత నంతనూ కందు కూరికే కట్టబెట్టున్నారే కానీ అందుకు కారణభూతుడు, అన్నివిధాల సహకరించిన వారు అయిన ఆత్మూరివారి పేరునుకూడ పేర్కొనడం లేదు.

మహాపండితుడు, ఆదర్శ ప్రాడ్వివా కుడు, స్త్రీ పునర్వివాహ ఉద్యమ మూల కారకుడూ, గొప్ప సంఘసంస్కర్త అయిన శ్రీ ఆత్మూరి లక్ష్మీ నృసింహ సోమయాజి విశ్వావసునామ సంవత్సరం శ్రావణ బ ౮ లు 25-8-1845వ తేదీన ఇప్పటి కృష్ణాజిల్లా నూజివీడు గ్రామములో జన్మించారు. తండ్రి కృష్ణమూర్తి. తల్లి రాఘవమ్మ. పితామహులు ఆత్మూరి సీతయ్య. మాతామహులు గుండు వెంకట్రాజు. భార్య యశోదాదేవి. పితామహ, మాతామహులు ఇర్వురూ జమీందార్లే. వీరి విద్యాభ్యాసం 1858లో ఆరంభమైంది. 1861లో బందరులోని మిషన్ స్కూలులో ప్రవేశించారు. సంవత్సరానికి రెండు పరీక్షలిస్తూ ప్రతి తరగతిలో ప్రప్రథములుగా ఉత్తీర్ణులౌచూ 1868లో యం.ఏ. పరీక్ష వ్రాసి అందులో సర్వోత్తమ ప్రథములుగా ఉత్తీర్ణులై ప్రభుత్వముచే గౌరవపతకాన్ని అందు కొన్నారు. అనంతరము రాజమండ్రిలో ఉపాధ్యాయులుగా నియమితులయ్యారు. 1871లో పాఠశాలల తనిఖీ అధికారి పదవిని స్వీకరించారు. సివిల్ పరీక్షలో విజయులై 1873వ సంవత్సరములో గంజాం పట్టణములో న్యాయవాదిగా "ప్రాక్టీసు' ను ప్రారంభించారు. ఆ తరువాత బి.ఎల్. పరీక్షవ్రాసి అందులో కూడా సర్వోత్తమ ప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు. ఈ శుభసందర్భాన్ని పురస్కరించుకొని బందరు పట్టణ ప్రజలు వీరిని ఘనంగా సన్మానించారు. వీరి గౌరవార్థము పండ్రెండు సార్లు ఫిరంగులను పేల్చారు. 1879వ సంవత్సరములో బందరు పట్టణములో ప్రభుత్వ న్యాయవాదిగా నియమితు లయ్యారు. 1880వ సంవత్సరములో "డిస్ట్రిక్టు మునసబు""గా ఎన్నికై తూర్పు గోదావరి జిల్లా అమలాపురంలో నియమింపబడ్డారు. 1887వ సం. త్సరంలో ఇప్పటి అనంతపురం జిల్లా పట్టణానికి బదిలీ అయ్యారు. ఆ సమయములోనే గుత్తి పట్టణములో

ఈయన వేదములపై ఉపన్యసించింది 1890వ సంవత్సరంలో గుత్తినుండి విజయనగరానికి బదిలీ అయ్యారు విజయనగరము అప్పుడు అప్పటి కళింగదేశానికి రాజధాని. ఆనందగజపతి ఆ రాజ్యాన్ని పాలిస్తున్నారు.

ఆనందగజపతి మహారాజు ఆంధ్రము, సంస్కృతము మొదలగు ఎనిమిది భాషలలో కవిత్వము చెప్పగల నేర్పరులు. సంగీత, చిత్రలేఖనాదులలో దిట్టలు. విజయనగరమునకు వెళ్ళిన ప్రతి ఉద్యోగి మహారాజును సందర్శించాలి అనేది ఆనాటి ఆచారము. మహారాజు దర్శనము కొఱకు సోమయాజి ప్రయత్నించగా వీరి విద్యాతిశయాన్ని విన్న బ్రాహ్మణులు ప్రభుసందర్శనానికి వీలు కల్పించలేదు. నరసింహార్యులు ఎన్నిమార్లు ప్రయత్నించినా విఫలుడయ్యారు. ఇది అదనుగా తీసుకొని అచ్చటి బ్రాహ్మణ పండితులు నరసింహార్యులు రాజభక్తిలేనివాడు, దురహంకారి అనీ ప్రభువుకు కొండెములు గూడ చెప్పారు. బ్రాహ్మణులు చేయుచున్న కుతంత్రమును గమనించిన సోమయాజి ఒక రోజు తనకు అంతవరకూ లభించిన వివిధ స్వర్ణఖచిత గౌరవ చిహ్న పతకములను ధరించి గంభీరుడై నేరుగా రాజసభాభవనమును ప్రవేశించి స్వీయ పరిచయం చేసుకొన్నారు. ఆయన ఉదాత్త గంభీరమూర్తిని తిలకించి ఆనందపరవశుడై సోమయాజులను గౌరవించారు. జరిగిన కుట్రను తెలుసుకొని అందుకు కారకులైన వారిని శిక్షించారు. అప్పటినుండీ వీరు రాజుకు ముఖ్య సలహాదారులు గాను, ఆత్మీయులుగాను అయ్యారు. మహారాజు వీరి ఉపన్యాసాన్ని గూడ ఏర్పాటు చేశారు. కృష్ణయజుర్వేద తైత్తరీయ సంహితలొని కొన్ని మంత్రాలకు జ్ఞానపరముగా వీరు అర్థమును ఉపన్యాస వేదికపై నుండి చెప్పడమే గాక, ఆస్థానపండితులు అడిగిన ప్రశ్నలకు అర్థము చెప్పి భాష్యములందు ఆధారముజూపి తన ప్రతిభను వెల్లడించుకొన్నారు. 1892వ సంవత్సరమున వీరు చేసిన ఆధానమునకు ఈ మహారాజు పండితులనుపంపి ఆర్థికసహాయాన్ని చేసి సత్కరించారు.

1884లో వీరు శ్రీకాకుళంకు బదిలీ అయ్యారు. 1999 లో వీరిని చిత్తూరుకు మార్చారు.

ప్లవనామ సంవత్సర జ్యేష్ట బ౦౦లు 13-6-1901వ తేదీ గురువారము ఈ మహాపండితులు పరమ పదించారు. వీరి చరిత్రను వ్రాసిన స్వర్గీయ శర్మ గారు వీరి మరణ సమయమును పేర్కొన్నారే. కానీ ఎక్కడ స్వర్గస్తులైనదీ వ్రాయ లేదు.

ఒకప్రక్క వైదికమత ప్రచారానికి నిరంతర కృషి చేస్తూనే, స్వసంఘోద్ధరణకు, వైశ్యులకుగల వేదాధికార స్థిరీకరణకు గూడ వీరు మిక్కిలి శ్రమించారు. గ్రంధ సంపాదనకు, వేదములు, సంహితలు ప్రకటించుటకు వైశ్య సంఘమువారిని న్యూనతగా చూస్తున్న బ్రాహ్మణపండితుల ఎదుర్కొనుటకు ఆయన సంపాదించిన ధనాన్ని అంతా వెచ్చించారు.

1890లో ఇప్పటి కడప జిల్లా ప్రొద్దుటూరు వాస్తవ్యులు

శ్రీ దుర్భాక వెంకటాచలశాస్త్రి గారు "వైశ్య శాంకరీయము"ను వ్రాశారు. శాలంకా యనుల శాపమువల్ల ఇప్పటి

వైశ్యులకు వేదసంస్కారాలకూ, వేదమంత్ర పఠనానికీ అర్హతలేదని బాధపడి, ఈ శాస్త్రులు ఈ వైశ్యుల కొఱకు పురాణోక్త పద్ధతిని రూపొందించారు. అందులో తాను పేర్కొన్న శ్లోకాలు పద్మపురాణాంతర్గతాలవి వ్రాసు కొన్నారు. తమను నిందిస్తూ వ్రాసిన ఆ పుస్తకాన్ని ఆనాటి కడవ శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానసభవారు ముద్రించడమే గాక వ్రాసిన ఆ శాస్త్రిగారిని ఘనంగా సన్మా నించారు కూడ. శాస్త్రి దురదృష్టము వల్ల ఆ వైశ్యశాంకరీయము సోమయాజుల వారి దృష్టిని పడింది. అగ్రహారదగ్రుడైన సోమయాజి, వైశ్యులను నిందిస్తూ వ్రాసి నందుకు మీమీద ఎందుకు సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకోగూడదో? తెలుపుము అని ఒక నోటీసును పంపారు. ఆ పుస్తకమును తాను వ్రాయుటకు పద్మపురాణము ఆధారమని జవాబు ఇచ్చాడు శాస్త్రి. పద్మపురాణములో ఈ కథ ఉన్నట్లు చూపించమని సోమయాజి తిరిగి సవాలు చేశారు. వాస్తవానికి ఆ కథ పద్మపురాణములో లేదు. అందువల్ల పద్మపురాణాన్ని తాను చూడ లేదనీ, తన మిత్రుడు ఒకరు చెప్పగా నమ్మివ్రాశానని అందుకు నన్ను క్షమించి వదలి పెట్టమని ప్రార్థనాపూర్వకంగా వ్రాసుకోగా వీరు ఆయన్ను మన్నించారు.

వైశ్యసంఘ గౌరవప్రతిష్ఠలను, వారికి గల వేదాధి కారార్హతను నిలబెట్టుటకు వీరు చేసిన కృషికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇట్టి సంఘటనలు వీరి జీవితంలో కోకొల్లలు .

ఉత్తర, దక్షిణ భారతదేశాన్ని వీరు అనేక సార్లు చుట్టి వచ్చారు. వీరు ఎక్కడ వెళ్లినా అక్కడి వైశ్యసంఘ పెద్దలను కలిసి సభలను పెట్టించి స్వసంఘాభివృద్ధికి కృషి చేయాల్సిన ఆవశ్యకతను చెప్పి వారిని చైతన్య వంతులను చేసేవారు. 1878లో ప్రయాగలో జరిగిన మద్యపాన నిరసన మహాసభ (గుడ్ టెంపుల్స్ కాన్ఫరెన్సు)కు అగ్రాసనాధిపత్యము వహించారు. ఉత్తర హిందూదేశములోని ప్రసిద్ధ పట్టణాలలో ఉపన్యాసాలిచ్చి సర్వజాతీయ నీతి ప్రచారక సంఘము వారిచే D.G.W.C.T అను బిరుదును పొందారు. కాశీని సందర్శించి అచ్చటి కాశీవిశ్వేశ్వరస్వామిని నమక, చమకములతో అభిషేకించి పూజలు చేశారు.

పశువధను ఆపుచేయించాలన్న మహోన్నత లక్ష్యముతో ఆనాటి దిగ్గంతు లైన బ్రాహ్మణ పండితులు ఆక్షేపణలు చెప్పి , అడ్డంకులు కల్పించినా వెఱవక పిష్ట పశువుతో యజ్ఞము చేసిన ఈ దయాసముద్రుడు, "పశువధాఖండనము' అను పుస్తకాన్ని ఆంగ్లములో వ్రాసి స్వధనంతో ప్రచురించారు. జాతరలందు జరుగు జీవహింసను ప్రభుత్వముచే నిలిపి వేయించుటకై ఈ పుస్తకాన్ని వ్రాశారు. అందుకై ఎంతో కృషిచేశారు. కానీ ఆయన లక్ష్యము నెరవేరలేదు. తరువాత రాజారామమోహనరాయ్ ఈ లక్ష్యము నెరవేర్చింది. అంటే జాతర్లలోనూ, సిండ్లు మొదలగు కార్యాల

లోను జరుగు జీవహింసను ప్రభుత్వముచే ఆపుచేయుంచు కార్యక్రమాన్ని రాజారామ మోహనరాయ్ కన్నా ముందుగానే వీరు ప్రారంభించారు.

వీరి చరిత్రను పాణ్యం లక్ష్మీ నృసింహశాస్త్రిగారు లక్ష్మీనృసింహసోమ యాజిచరిత్ర అను పేర ఆరాశ్వాసాల పద్య ప్రబంధముగా వ్రాశారు. కొమ్మనూరు శివరామాత్య కవి "శ్రీ యజ్ఞాళివర్ణనము' 'అను పేరుతో పద్యకావ్యంగా రచించారు. "శ్రీ మద్ధరితకుల కలశజలధి రాకా సుధాక రామాయణ "అను బిరుదుగల వెంకటా రామానుజార్యుల వారు "లక్ష్మీనారసింహ సవనవిలాసము" అను పేర పద్యకావ్యంగా రచించారు. "లక్ష్మీనరసింహసోమయాజి చరిత్రము"అను పేర వీరి చరిత్రను వచన గ్రంథముగా వ్రాసిన "రాజవైద్య " అను బిరుదుగల గ్రంధి వెంకటసుబ్బరాయశర్మ గారు నాటకంగా వ్రాశారు. ఈ నాటకము ప్రథమముద్రణ జరిగింది. అందులో అనేకంగా తప్పులు ఉన్నాయి. గుప్తగారు దాన్ని తిరిగి సంస్కరించారు. ఆ సంస్క రణప్రతి ముద్రణ భాగ్యానికి నోచుకొలేదు. పైవాటిలో మూడవది అయిన "లక్ష్మీ నారసింహసవన విలాసము "ను 1898వ సంవత్సరములో ఘంటసాల జగన్నాథ గుప్తగారు ముద్రించారు. పై నాలుగు ౦ను సేకరించి, అవసరమైతే తిరిగి ముద్రించి భావితరాలకు భద్రపరచడము ప్రతి వైశ్యుని కర్తవ్యము. ఈ కృషి చేసిన వారు తప్పక అభినందనీయులు అవుతారు.

సోమయాజులవారికి వెంకటకృష్ణారావు, అహీపతిరావు, రామమోహనరావు, జగన్మో హనరావు అని నలుగురు కుమారులు. రాఘవాంబ, లక్ష్మీకాంతమ్మ అని ఇద్దరు కుమార్తెలు. పెద్దవారు వెంకటకృష్ణారావు బాల్యములోనే మరణించారు. రెండవవారు అహీపతిరావు ఆంగ్లమున బి.ఎ పట్టాను పుచ్చుకొన్నారు. సంస్కృతములో అసమాన ప్రావీణ్యతను గడించారు. కానీ ఆయన శక్తియుక్తులు, పాండిత్య ప్రకర్షణ లోకము చూడకుండానే కన్నుమూశారు మూడవ వారు రామమోహనరావు. వీరు సంస్కృత, ఆంగ్లభాషా పరిచయము కలిగినవారే కాక ఉర్దూభాషలో కవిత్వము కూడ చెప్పేవారు. ఆంధ్రుల్లో చిత్రలేఖనములో పరిశ్రమ చేసిన వారిలో వీరే ప్రథములు అని పలువురిభావన. వీరు కుంచెను విదిలిస్తే చాలట ముగ్ధమోహ నమైన చిత్రము సాక్షాత్కరించేదట వీరు కొన్నాళ్ళు గుంటూరులో ఉండినారు. బ్రహ్మశ్రీ రాయప్రోలు వెంకటరమణయ్య సోమయాజిగారు సజీవపశువుతో యజ్ఞం చేయ సంకల్పించగా జీవహింస చేయ కూడదని ఉపన్యాసము ఇచ్చి పిష్టపశువుతో యజ్ఞముచేయడమే ఉత్కృష్ఠ ధర్మమని ఒప్పించారు. "యజ్ఞము"అను చిన్న గ్రంథాన్ని ముద్రించి, తన తండ్రి సిద్ధాంతమును మరొక్కసారి ప్రజల దృష్టికి తెచ్చారు. రామమోహనరావు గారి భార్య అన్నపూర్ణ. ఈమె "కుమార సుగుణబోధిని' 'అను పద్య గ్రంథాన్ని వ్రాసింది. వీరి కుమార్తె శ్రీమతి సత్యవతి. మృధుమధర భక్తిరసోపేతంగా "భక్తిరసామృతము"అను

గ్రంధాన్ని రచించింది, ఈమె భర్త చీమకుర్తి బసవయ్య

శర్మగారు వ్రాసిన వీరి చరిత్రలో సోమయాజుల వారి దుహితుడుగా మాజేటి సత్యనారాయణ, మల్లిఖార్జునరావు లను పేర్కొన్నారు. బహుశా ఈ ఇర్వురూ కూడ మొదటి కుమార్తె రాఘవాంబ కుమారులో లేక లక్ష్మీకాంతమ్మ కుమారుల్లో కావచ్చు వీరు ఇర్వురూ కూడా ఆంగ్ల భాషలోనూ, చిత్రలేఖనములోనూ అస మాన ప్రతిభగలవారని సుబ్బరాయశర్మ గారు పేర్కొన్నారు.

మహాపండితులు, అసమాన మేధావి, గొప్ప సంస్కర్త, వైశ్యజాతి గౌరవాన్ని శిఖరాగ్రానికి చేర్చిన మహావ్యక్తి శ్రీ లక్ష్మి నృసింహసోమయాజికి బందరులో జ్ఞాపక భవనాన్ని కట్టించుటకు కృషి చేసిన వారు ఏ కులస్తులో తెలుసా? ఆ కృషికి ప్రేరకులు క్రిష్టియన్ మతస్తులూ, హైకోర్టు వకీలు శ్రీ జె.సామ్యుయేల్ గారు కాగా, ఆ జ్ఞాపకభవన నిర్మాణానికి కృషిచేసింది బ్రాహ్మణులైన దశిక కృష్ణమూర్తి శాస్త్రి సోమయాజులుగారు. శాస్త్రిగారు మొదట సోమయాజిగారికి వ్యతిరేకులే అయినా, వాస్తవాన్ని గ్రహించి, వీరియెడ అభిమా నము, గౌరవము కలిగించు కొన్నవారు. శాస్త్రిగారు శ్రీ కన్యకా పరమేశ్వరిని భక్తితో పూజించేవారు. అవసాన కాలమందు తనను శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానం వీధినుండే స్మశానానికి తీసుకవెళ్ళండని అని కూడ వారి బంధువులను కోరి ఉండినవారట. ఆ ప్రకారమే శాస్త్రిగారి శవాన్ని రుద్రభూమికి తీసుకపోయారట కూడ. సోమయాజికి జ్ఞాపక భవనాన్ని కట్టించమని ప్రేరేపించిన శ్రీ సామ్యుయేల్ గారు ఒక వేళ అందుకు ఎవరూ పూన కొనకున్న తానే కట్టిస్తానని కూడ ప్రకటించి ఉండినాడట. ధనార్జనకు ప్రాదాన్యత ఇవ్వక కేవలం సాహిత్య పరిశ్రమ, స్వసంఘగౌరవ రక్షణే ప్రధానంగా భావించి కృషిచేసేవారి యెడ వైశ్యులు చూపే ఆదరణ, కృతజ్ఞత, గౌరవములు ఏవిధంగా ఉంటాయో? అని ఆలోచించే వారికి పై సంఘటనకన్నా దృష్టాంతము అవసరము లేదనుకుంటాను.

సోమయాజియెడ మిగులభక్తి భావన గల చిలకల రాజగోపాలగుప్తగారు కుంభ కోణములో 25-5-1912నుండి 28-5-1912 వరకూ ఆధానము చేసి "దీక్షిత" నామాన్ని ధరించారు. గుప్తగారు మంచి రత్నవర్తకులు. గుంటూరు పట్టణములోని సకలా వీరయ్య గుప్తగారు "వైశ్యదేవము "ను చేశారు. వైశ్యులకుగల వేదాధికారాన్ని ప్రశ్నించే వారిని ఎదుర్కొనుటకు శ్రీ సోమయాజులవారు అనేక సార్లు న్యాయస్థానాలకు దోషిగా కూడ హాజరు కావాల్సి వచ్చింది. కడకు జయిం చింది వీరే. విజయము ఎప్పుడూ ధర్మము వైపునే ఉంటుంది.

జూన్ 13 వీరి వర్ధంతి
సందర్భంగా
ఈ వ్యాసాన్ని ప్రచురించటం జరిగింది.

వైశ్యప్రబోధిని, జూన్ 1997

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973

బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు ఉదహరించిన

## ంతి నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు ులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడ ు. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును సంవత్సరమనగ ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజుల ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలన సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపర్చవలెను ఒక తేదీన ఒకరి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకతికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ః రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను అలా తెలియపరచనిచో ఒకరోజు ,

ే తీసుకోబడును. త పంపినవారికి
వాపసు పంపబడును. పంపవలెను

పంపవలెను.

యితరులు ు. విశేష పర్వదినములలో రిజర్వేషను

ఆర్.ఆర్.నాథం ఇండియా
మేనేజింగ్ పరిపాలనా

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 జూన్ 21 నుండీ 1997 జులై నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 22 | 29 | 6 | 13 | 20 |
| సోమవారము | | 23 | 30 | 7 | 14 | |
| మంగళవారము | | 24 | జులై 1 | 8 | 15 | |
| బుధవారము | | 25 | 2 | 9 | 16 | |
| గురువారము | | 26 | 3 | 10 | 17 | |
| శుక్రవారము | | 30 | 4 | 11 | 18 | |
| శనివారము | 21 | 28 | 5 | 12 | 19 | |

జూన్ 22 :- అరుద్ర కార్తె రాక ఉ. 3.86 వివరాలనుతెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం.26 Aను అందుకు

జూన్ 30 :- (1) కార్పొరేట్ అసెసీ, కో-ఆపరేటివ్ సొసైటి కాని అసెసీలు, సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు తుది రోజు

వ్యాపార సంబంధము లేక వృత్తి సంబంధమైన ఆదాయములు కలిగిన ఆదాయములుగల అసెసీలు 1997 -1998 అసెస్‌మెంట్ సంవత్సరానికి పంపవలసిన ఆదాయపు పన్ను లేక సంపద పన్ను రిటర్నులను, అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు.

(2) 1997 -98 అసెస్‌మెంట్ సంవత్సరానికి పంపవలసిన గిఫ్టుట్యాక్సు రిటర్నును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరి తేది.

(3) ఆదాయపు పన్ను చట్టములోని 194 D. విభాగము క్రింద ఇన్సూరెన్సు కమీషన్ విషయంగా పంపవలసిన రిటర్ను ఫారము నెం.26 D ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి అందించుటకు ఆఖరుతేది.

(4) 1996 - 97 ఆర్థిక సంవత్సరములో ఆదాయపుపన్నును తగ్గించుకొనకుండా చెల్లించిన, లేక వ్రాసుకొన్న ఇన్సూరెన్స్ కమీషన్ వివరాలనుతెలుపు రిటర్ను ఫారము నెం 26 E ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

(5) పదవీవిరమణ చేయు ఉద్యోగులకు 1997 మే నెలలో చెల్లించిన జీతము, ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలనుతెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెంబరు 21ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

(6) 1997 మే నెల జీతములో పట్టుకున్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు కడపటి రోజు.

(7) ఆదాయపుపన్నుచట్టములోని 193వ విభాగము క్రింద సెక్యూరిటీల ద్వారా వచ్చు వడ్డీలను పట్టుకున్న మొత్తము వివరాలనుతెలుపు ఫారము నెం. 25ను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

(8) ఆదాయపుపన్నుచట్టములోని 19 A విభాగము క్రింద సెక్యూరిటీల మీద వచ్చు వడ్డీలు కాక ఇతర వడ్డీల విషయంగా పట్టుకొన్న మొత్తము

(9) ఆదాయపు పన్ను చట్టములోని 194 C విభాగము క్రింద, కాంట్రాక్టర్లు సబ్ కాంట్రాక్టర్లకు చేసిన చెల్లింపుల విషయంగా పట్టుకొన్న మొత్తము పన్ను వివరాలనుతెలుపు అన్యువల్‌రిటర్ను ఫారము నెం. 26C ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి పంపుటకు చివరి రోజు.

(10) 1996 -97 ఆర్థిక సంత్సరానికి సంబంధించి, 1987 నేషనల్ సేవింగ్స్‌స్కీము క్రింద చేయబడిన డిపాజిట్‌ల క్రింద చెల్లించిన వివరాలను తెలుపు ఫారం నెం. 26Fను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు కడపటి రోజు.

(11) 1996 -97 ఆర్థిక సంవత్సరములో పొందిన అద్దెల (RENTS) వివరములనుతెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం.26Jను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి పంపుటకు ఆఖరు తారీఖు.

జులై 6 :- పునర్వసు కార్తె రాక ఉ 11.08

జులై 15 :- సి.యస్.టి ఫారాన్ని రెండు కాపీలుగా అందులో చూపబడిన మేరకు కట్టవలసిన అమ్మకంపన్నుకు సంబంధించిన డిమాండుడ్రాఫ్టుతో అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

జులై 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A 2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

జులై 16 .- తొలి ఏకాదశి - దక్షిణాయన పుణ్యకాలము

జులై 18 :- మిలాడీనబి

జులై 20 :- పుష్యమీ కార్తె రాక

జులై 20 :- A2రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితేదీ

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

**(రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)**


టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"

టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004

శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030

పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682


## వైశ్య యాత్రికులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయ్యారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంధి. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్థుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును. 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక బోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్థులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రికుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రికులు ఉపయోగించుకొన కోర్తాము.

### తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

వారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు
పేరు చెక్కించబడును. (400 మంది వరకు

ు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి
యిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫొటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. <u>శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్థ మహా క్రతువు</u> 27.4.97 నుండి 5.5.97 వరకూ విజయవాడ శ్రీ భావనారాయణ కాలేజీలో జరిపించుచున్నాము.

పై యజ్ఞము జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు - మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన యజ్ఞం, రెండవరోజు రామకృష్ణ యజ్ఞం, మూడవరోజు అష్టలక్ష్మి యజ్ఞం, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి యజ్ఞం, ఐదవ రోజు పుత్రకామేష్టి యజ్ఞం, ఆరవరోజు రుద్రయజ్ఞం, ఏడవ రోజు సప్తశతి, దుర్గాయజ్ఞం, ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి యజ్ఞం, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ యజ్ఞం, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 12 నుండి 4 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, 4 నుండి 7 వరకు ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-8 వరకు లక్ష ద్వీపాలంకరణలు, 8-10 ఆధ్యాత్మిక ప్రదర్శనలు జరుపబడును. యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటీవారు ఉచితముగా యివ్వగలరు.

## <u>ఇందులకై సమర్పించవలసిన విరాళములు</u>

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.


ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, 3-308, మార్కాపురం - 523 316.


**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చే కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి (సంపాదకులు)

(గత సంచిక తరువాయి)

దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాని, శారద, అంబిక- అను పదునాల్గు నామములతో విరాజిల్లుచుండు- ఆ తల్లి - ఈ విశ్వము యొక్క స్థితినే నిర్ణయిస్తూ ఉంటుంది. విశ్వగమనమును నిశితంగా పరిశీలిస్తూ ఉంటుంది. అనేకములైన - చిత్ర విచిత్ర ములైన లీలా విలాసాలతో - మాహాత్మ్య ముతో అలరారుచూ ఉంటుంది.

పరాంబకు గల పదునాల్గు రూపాలలోనూ, క్రోధ గుణమునకు తావులేనిదీ, మధు- మాంస - తామసాది వామాచారాదిపూజలు స్వీకరించనిదీ - అత్యంత ప్రశాంతమూ, అతి సుందరమూ, మహా మనోహరమూ, మాధుర్య గుణ ప్రపూర్ణమూ అయినదీ 'కన్యకా' రూపమని తెలియండి. మణిద్వీపమున గల 'రత్నాలదీవి' లో ఆ పరాంబ ఒకనాడు కొలువుదీరి ఉంది. ఆ రత్నాల దీవి - కల్ప వృక్షములతోనూ, మందార భూజము లతోనూ, మనోజ్ఞ పారిజాత కుసుమ పరిమళములతోనూ, శుక, పిక, శారికల కల కూజితములతోనూ, సువాసనా భరితము, మనోజ్ఞస్వర విలసితమూనై ఉంది. మహేంద్రాది బృందారకులునూ, మునులునూ, మున్యాంగనలునూ, దిక్పాలురు, వసువులు, రుద్రులు మొదలగు దేవతలూ- ఆ కొలువులో - ఆ దేవిని భయ, భక్తులతో సేవిస్తూ ఉన్నారు. కోటి సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్న ఆ జగదంబకు ఇరువైపులా నిలిచి లక్ష్మీపార్వతులు వింజామరలు వీస్తున్నారు. శారదాదేవి తన అపార పాండిత్య కవిత్వ విలాసముతో - ఆ దేవిని కీర్తిస్తూ ఉంది. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు ముప్పురూ అప్రమత్తులై నలుకెలంకుల బరాబరులు చేస్తూ ఆ పరాశక్తి అజ్ఞలకై ఎదురు చూస్తున్నారు.

- ఆనాటి - ఆ సభలో - సృష్టి, స్థితి, లయాల సమీక్ష జరుగుచూ ఉంది. భూదేవి లేచి - సాష్టాంగ ప్రణామం చేసి, ముకుళిత కరకమలములతో నిలబడింది. ఆ దయామయి, ఆ ధరాదేవి వైపు చూసింది. ఆ చూపుల్లోని భావాన్ని గమనించి వసుంధరాదేవి "జగదీశ్వరీ! ఇప్పుడు భూలోకము పూర్తిగా హింసామయమైంది. శాంతి , సామరస్యాలకు కొఱత ఏర్పడింది. దుష్టుల, దుర్మార్గుల సంఖ్య మితిమీరింది. అందువల్ల నాకు తిరిగి భూభారమైంది. నా యీ భారాన్ని తగ్గించుటకు తిరిగి, అవతార మెత్తమని వేడుకొనుచున్నాను" - అని పలికింది.

అంత - ఆ అంబ, పరాంబ వసుంధరా దేవిని ఎగాదిగా చూచింది. ఊరడిల్లుము. వసుంధరా ! ఊరడిల్లుము. నీ ఆవేదనను గమనించాను. అందుకు ఇంతకు ముందే బీజమును వేశాను. ఇంతకు ముందే ఉత్తరదిశకు అధిపతియైన కుబేరునికి ఒక వరం ఇచ్చాను. ఆ వరాన్ని నెరవేర్చ వలసిన సమయం ఆసన్నమైంది. ఇప్పుడు - భూమండలమున గోదావరీ తీరమున 'బృహద్రి' (పెనుగొండ) ని పరిపాలిస్తున్న కల్హారునికి ధనపతి పుత్రుడుగా జన్మిస్తాడు. ఆయన జన్మించినపుడు కుసుమ (పూల) వర్షం కురుస్తుంది. అందువల్ల అతడు 'కుసుమగుప్తుడు ' గా పిలువబడతాడు. ఆ కుసుమగుప్తుడు చేసే యజ్ఞమునకు ఫలముగా అతని సతీమణి గర్భమున నేను జన్మిస్తాను. ఒకప్పటి నా ఆగ్రహ ఫలితముగా గంధర్వ రాజైన చిత్రకంఠుడు భూలోకమున - "పద్మశయనపురము" న జన్మించి నా సంకల్పమును నెరవేర్చుటకు కారణ భూతుడుగా ఉంటాడు. ఇంతకు మునుపటి నా అవతారాలన్నింటిలో హింసను హింసతోనే తుదముట్టించాను. ఇక ముందు జరుగు నా అవతారము ఇందుకు పూర్తి విరుద్ధముగా ఉంటుంది. హింసకు కొంత కూడ తావు లేని, సరిక్రొత్త విధానములో హింసను అంతము చేస్తాను . నీ భారాన్ని తగ్గిస్తాను. శాంతినీ, సౌభాగ్యాన్నీ ప్రపంచములో స్థాపిస్తాను. జగన్మనో మోహనమైనదిగా అనాటి నా రూపము ఉంటుంది." - అని ఆ జగదంబ బదులిచ్చింది. భూదేవి శాంత చిత్తయై, ఒక నిట్టూర్పు విడిచింది.

సాలంకాయన మహర్షి చెప్పుచున్న శ్రీ వాసవీ మాహాత్మ్యమును విని ప్రముదిత హృదయులై ఉన్న వైశ్య ఋషులు "ఓ మునిచంద్రమా! ఉత్తరదిశాధిపతియైన కుబేరునికి జగదంబ పరాశక్తి ఏమని వరమును ఇచ్చింది? ఏ సందర్భమున? ఏ కారణము వలన గంధర్వ రాజగు చిత్రకంఠుడు జగన్మాత కోపానికి పాత్రుడయ్యాడు? వివరించి మా వీనులకు విందు చేయండి" - అని అడిగారు.

వారి ఆ ప్రశ్నలు సాలంకాయనునేకు ఆనందాన్ని కలిగించాయి. వైశ్య ఋషులారా! జగన్మాత కథాశ్రవణ కుతూహలము గల మీరు పుణ్యాత ములు. ఆ జగజ్జనని ని మీ హృదయార విందాలలో నిలుపుకొన్న మీరు సులభముగా మోక్షమును పొందగలరు. కథను వినుటలో మీకు గల ఆసక్తి, శ్రద్ధ,ఏకాగ్రత నాకు ప్రమోదమును కలిగించి, కథను వివరంగా చెప్పుటకు ఉత్సాహాన్ని కలిగిస్తూ ఉంది . మీరడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్తున్నాను . సావధానులై వినండి.

జగన్మాత శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవికి సహస్ర ప్రణామాలు చేసి, తిరిగి కథను ప్రారంభించారు. సాలంకాయన ముని చంద్రులు.

"మహానుభావులారా! పార్వతీ దేవిని బిడ్డగా పొందినాను అను గర్వమూ అతిశయమూ పర్వతరాజగు హిమవంతునిలో అప్పుడప్పుడు బహిర్గతము అగుచూ ఉండేది. ఒకానొక సందర్భాన, ఆ పర్వత రాజు యొక్క ఆ వైఖరి కుబేరునికి కొంత మనస్తాపాన్ని కలిగించింది.

హిమవంతుడు పార్వతిని బిడ్డగా పొంది నపుడు, చరాచరమైన ఈ సర్వ సృష్టికీ మూలమైన ఆ జగజ్జననినే నేనూ ఎందుకు బిడ్డగా పొందకూడదు? అను ఆలోచన కలిగింది.ఆ ఆలోచన రాగానే,ఆయన వన సీమలకు వెళ్ళి, ప్రశాంతమైన ఒక స్థలమున కూర్చొని, ఆదిశక్తిని తన మనస్సులో నిలుపు కొని, తపస్సును ప్రారంభించాడు. ఆకులు ఆహారముగా కొన్ని యేండ్లూ, ఉదకమే ఆహారంగా కొన్ని వత్సరాలు, కేవలము గాలి మాత్రమే ఆహారంగా కొన్ని సంవత్సరాలు ఉగ్రమైన తపస్సు చేశాడు. ఆయన చేసిన ఆ తపస్సుకు జగన్మాత సంతసించింది. కరుణించింది. సాకారయై ఎదుట నిలిచింది. వత్సా! అని పిలిచింది. మధురాతి మధురమైన ఆ శబ్దము అతని కర్ణ పుటములలోతాకి-కుబేరుని బాహ్య స్మృతికి తెచ్చింది. మెల్లగా కన్నులు తెరచాడు. ఎదుట ఆదిశక్తి. వెంటనే లేచి నిలబడ్డాడు. ఆమె పాదార విందాలను తాకి నమస్కరించాడు. కరములు జోడించి ఎన్నో విధాలుగా సంస్తుతించాడు. అతని భక్తికీ, తపస్సుకూ మెచ్చిన ఆ అంబ జగదాంబ "కుబేరా! ఏమి కోరి ఈ ఉగ్ర తపస్సును నన్ను హృదయములో ప్రతిష్ఠించుకొని చేశావు? - అని ఆర్ద్ర హృదయముతో అత్యంత ప్రసన్న వదనంతో అడిగింది.

తల్లీ ! పరాశక్తివైన నీవు నాకు బిడ్డగా జన్మించు . నన్ను హిమవంతుని కన్నా ఉన్నతునిగా నొనర్చు" అని భక్తి ప్రపత్తులతో ఆ తల్లికి విన్నవించు కొన్నాడు.

ఆశ్రితుల పాలిటి కల్ప వృక్షమూ, అవ్యభిచారమూ, నిశ్చలమూ అయిన భక్తితో ఆరాధించు వారి కొంగు బంగారమూ అగు ఆ తల్లి కాదంటుందా ! నీ బిడ్డగా జన్మిస్తానని మాట ఇచ్చింది. అయితే, "కుబేరా! నేను నీకు బిడ్డగా జన్మించడము అనేది ఈ జన్మలో జరగదు. నా సంకల్పము వలన కలియుగమున నీవు జన్మిస్తావు. 'కుసుమగుప్తుడు' అను పేరుతో ప్రసిద్ధుడవు అవుతావు. అప్పుడు నేను నీకు బిడ్డగా పుడ్తాను. నీ యీ కోరిక అప్పుడు తీరుతుంది. ఆ విధంగా ఒకనాటి నా అవతార ధ్యేయ సాధనకు నీవు ఆలంబనగా నిలుస్తావు. - అని ఆనతిని ఇచ్చింది ఆ పరాంబ.

జగదంబ పలికిన పలుకులు విని అనంత ఆనందాన్ని పొందిన ఆ ధనపతి ఆ జగజ్జననికి సహస్ర వందనములు అర్పించి "అమ్మా! కృపామయీ! నీకోర్కెను మన్నించి నన్ను కరుణించినందుకు నాకు ఎంతో సంతోషం కలిగింది. కానీ, నా కుమార్తెగా అవతరించే, అప్పటి ఆ రూపమును తిలకించాలని నా మనస్సు ఉవ్విల్లూరుచూ ఉంది. దివ్య మంగళకరమైన అప్పటి ఆ రూపముతో ఒకసారి నా యీ నేత్రములకు పండుగ చెయ్యి. ఈ జన్మకు కూడా చరితార్థతను కలిగించు". అని ప్రార్థించాడు ఆ ఉత్తరదిశాధిపతి.

భక్తజన సులభయైన ఆ కరుణామూర్తి పదునైదు వర్షముల ప్రాయముతో -చిఱు నగవులు చిందే వదనముతో, మనోహరమూ, దివ్యమూ అయిన రూపముతో సర్వాభరణములతో నేలపై జీరాడు కుచ్చెల చెఱుగులతో, బంగారు గజ్జెల సవ్వడితో కుబేరుని ముందు నిలిచింది. ఆయన కోర్కెను తీర్చింది. అతనికి ఆనందాన్ని కలిగించింది. ఆధనాధిపుడు 'ధన్యోస్మి' అనుకున్నాడు. అదే సమయమున - అదే

మార్గాన ఆకాశయానం చేస్తున్న చిత్ర కంఠుడు అను గంధర్వరాజు జగన్మోహన మైన పదునైదు వర్షముల ప్రాయము గల ఆ ఆదిశక్తి ఆ ఆకార వైభవమును తిలకించాడు. మానసోల్లాసాన్ని, జీవిత సాఫల్యాన్ని కలిగించవలసిన ఆ తల్లి ఆ రూప సందర్శన ఆ ఆదిశక్తి సంకల్ప ప్రభావం వల్ల అతనిలో కామమును కలిగించింది. కన్యకగా ఉన్న ఆ తల్లిని కామ పంకిలమైన దృష్టితో తిలకించాడు. అది గమనించిన ఆ జగజ్జనని దుర్మార్గుడా! ఈ సర్వ చరాచర సృష్టికీ, ఆసృష్టిలో ఒక్కడివైన నీకూ తల్లినైన నన్ను విచక్షణను కోల్పోయి, నిజస్థితిని విస్మరించి, కామ పంకిలమైన కళ్ళతో చూచిన నిన్ను క్షమించకూడదు. భూలోకమునబుట్టి, ఈ పాప ఫలితమును అనుభవించు అని ఆ అమ్మ అతనికి శాపాన్ని ఇచ్చెను.

నిజ స్థితికి వచ్చి - తన తప్పును తెలుసుకొన్న ఆ గంధర్వ రాజు ఆ తల్లి పాదాలపై బడెను. " ఓ పరమేశ్వరీ! నా తప్పును మన్నించు. ఇది కేవలము కాల వశమున కలిగిన అకాల కామ ఫలితమే కాని అన్యము కాదు. కారుణికతార్ణవంబ వగు ఓ జగన్మాతా! నన్ను మన్నించు విస్మృతి మార్గాన్ని ప్రసాదించు" అని గద్గదమైన కంఠము తోను, చలించుచున్న దేహముతోను ఆ తల్లిని ప్రార్థించెను.

చిత్రకంఠా! లే, స్వస్థత పొందుము. తప్పును తెలుసుకొన్న నీకు శుభమగును. అయినా నా ఆగ్రహ ఫలితాన్ని అనుభ వించక తప్పించుకోలేవు. కలియుగమున - భూలోకమున నీవు చంద్రవంశరాజుగా జన్మిస్తావు. అప్పుడు - నా యీ మనోహర రూపము లీలా మాత్రంగా గోచరమై కామభావనను నీ చిత్తములో రేకెత్తిస్తుంది. అంతరాంతరాలలో ఏర్పడ్డ ఆ భావము లోనే ఉండి, కుమిలి, కుమిలి, మృగతృష్ణకై పురుగులిడు జడుని వలె పరుగులిడి, పరితపించి, చివరకు నా ఆ అవతార సమాప్తి ఉదంతము చెవుల బడగానే మరణిస్తావు. ఆనాటి ఆ నా అవతార లక్ష్యమునకు ఆ విధంగా ఒక సాధనంగా నిలుస్తావు. అందువల్ల మరణానంతరము - తిరిగి గంధర్వ రాజువై - నన్ను అరాధించి, నాలో ఐక్యమౌతావు' -అని తెల్పింది పరాంబ ఆ పరమేశ్వరి.

( ఇది స్కాంధ పురాణమందు - సనత్సు జాతీయ సంహిత గల ఉత్తర ఖండము - వైశ్య ఋషులకు సాలంకాయనముని చెప్పిన శ్రీ వాసవీ అవతారమునకు గల ద్యేయము - మూడవ అశ్వాసము.)

(ఇంకా ఉంది)

## ముంబయ్‌లో ఒక్క కోటి యాభై లక్షలతో మాతృశ్రీ ఆలయ నిర్మాణానికి ప్రయత్నం

ముంబయ్ పట్టణము, మాతుంగ అందలి తెలంగ్ రోడ్డులో 403 వ నెంబరు వాసవీ నిలయం ప్రధాన కార్యా స్థానంగా గల ది బొంబాయి ఆర్య వైశ్య సంఘము వారు 8000 చ.అ. వైశాల్యములో శ్రీవాసవీకన్యకాపరమేశ్వరీ ఆలయము, నాలుగు అంతస్థుల భవనము అందులో రెండు విశాలమైన కళ్యాణ మంటపాలను 18 గదులతో నిర్మించుటకు తీర్మానించి 20-11-96 నుండీ నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించారు.




# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
6. STD, ISTD, FAX Facilities.
7. A Doctor on call.
8. Safety Lockers.
9. Ample parking space.
10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 3394320, Res : 3313796 (STD : 040) Fax : 394320**

# వైశ్యులు అనేక నగర రాజ్యాధీశులు

స్వర్గీయ విద్వాన్ అంబటి సుబ్బరాయ గుప్త

గత సంచిక తరువాయి

ఈ వాసవకన్యకాపురాణము స్కాంధ పురాణాంతర్భాగమని శ్రీసామివెంకటాచలంశ్రేష్ఠి గారు తమ వైశ్య డైరెక్టరీ యందు జనవదంతిని బట్టి నుడివియున్నారు. చిత్తూరివారి శ్రీ మత్కన్యకాపురాణమందును, మద్రాసు వారి వాసవకన్యకాపురాణమందును, అధ్యాయాంత గద్యాదులందు " ఇతి శ్రీ స్కాంధే ఉత్తరఖండే, సనత్సుజాత సంహితాయాం" అని స్కాంధపురాణము లోని దీ కన్యకాపురాణమని పేర్కొన బడినది. కాని శ్రీ పెనుగొండ వారి వాసవ కన్యకాపురాణమందట్లు లేదు. స్కాంధ పురాణ మందు మాత్రము వాసవకన్యకా చరిత్రమునకు సంబంధించిన విషయ మేదియును గానరాకున్నది. ఈ విషయ మునే కీ.శే. తుంపూడి భగవంతం గుప్తగారు వాసవి రెండవ సంపుటం 10వ సంచికలో కన్యకాపురాణమును గురించి వ్రాసిన వ్యాసమందు "కన్యకాపురాణము" స్కాంధ పురాణము లోనిదని చెప్పుటయే గాని అందు గానరాకుండు టేల? అని ప్రశ్నించుచు, నందువలన నారులు దీనిని నమ్మకున్నారని వ్రాసియున్నారు. కాని మార్కండేయ పురాణోత్తరభాగమందు నీ వాసవకన్యకాగాథ మరియొక విధమున దెలుపబడియున్నది. కీ.శ. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు కూడా యీ విషయమునే రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక యందు ప్రకటింపబడిన వారి "విష్ణువర్ధనుడు - వాసవకన్యక ' 'అను వ్యాస మందు చెప్పియున్నారు. మార్కండేయ పురాణమందు దెలుప బడిన గాథ యీ క్రింది విధముగా నున్నది.

మాళవదేశాధిపతియు, ఉజ్జయినీ పురేశ్వరుడును, శృంగ వంశోద్భవుడు నగు రాజరాజనరేంద్రుడు దిగ్విజయార్థము రెండు కోట్ల సైన్యముతో బయలుదేరి, నాగపురి, కాశి, మధుర, సింధు, కౌశాంబి, వజ్రపురాధిపతులను జయించి, వంగ దేశాధిపతి వృంతకుని, ఓడ్రదేశాధిపతి దండపు నోడించి, కళింగ దేశమున బ్రవేశించి పూసపాటిని జయించి, జయపురాధీశుడైన గణపతి నోడించి, శూరసేన రాజును జయించి... విజయవాటిక బ్రవేశించి యింద్రకీలాద్రి నెక్కి కనకదుర్గను సేవించి, ఫేనకాండము (పెనుగొండ) నకు జేరును. సకల సంపత్సమేతమును విశ్వకర్మ నిర్మితమగు నా ఫేను కాండపురంబున నలకూబరునిచే శపింపబడిన యక్షజాతులను వైశ్యులు నివసింతురు. రాజరాజ నరేంద్రుడా పట్టణ ప్రవేశము గావించి, ధనాధిపతియగు కుసుమాహ్వయుని కుమార్తె యగు వాసవ కన్యకను గాంచి, మోహించి యామెను దన కిచ్చి పెండ్లి చేయమని కోరగా వైశ్యులు

ముందు "సరి" యని తదుపరి నీయమని మోసము జేతురు. కాన రాజు కోపముతో, వేయి మంది భటులను బంపగా, వైశ్యులలో గొందరు భయపడి పారిపోవుదురు... కొందరు ఆభీరులందును, కళింగులలోను గలియుదురు. మరి కొందరు బుక్కభూపాలుని దేశమునకు బోయి బుక్కాకోమట్లగుదురు. తక్కిన వారు వాసవితో కూడా అగ్నిగుండములలో బ్రవేశింతురు.

ఈ కథ యొక్క యదార్థ్యమెట్లున్నను దీనినుండి గ్రహించవలసిన విశేషమొకటి కలదు. పెనుగొండను స్థూలాద్రియని, పెద్దకొండలు గలది యని చెప్పుటగలదు. కేవలము గోదావరీనదీ మైదానమున గల పెనుగొండ కడ కొండ లుండుట అసంభవము. ఈ మార్కండేయ పురాణ గాథ యందు అది ఫేనకొండమని పేర్కొనబడినది. ఫేనకొండమె పెనుగొండ యైనదని చెప్పుట సమంజసము.

ఇక నీ వాసవకన్యకాపురాణగాథ జరిగిన కాలమందు ఆంధ్రదేశమున ముఖ్యముగా ఆర్యవైశ్యులందు వెలసిన రాజకీయార్థిక సాంఘికాది సాంస్కృతిక పరిస్థితులఁగూర్చి కొంత ముచ్చటించ దగును.

ఈ పెనుగొండ నగరమున వాసవ కన్యకాపురాణ మందలి సంఘటనలు జరిగినపుడు ఆంధ్రదేశమున తూర్పు చాళుక్య రాజుల పరిపాలన సాగుచుండెను. కనుక తూర్పు చాళుక్య యుగ మందలి ఆంధ్రదేశచరిత్రకు ప్రతిబింబమే చాలా వరకు వాసవకన్యకాపురాణగాథ యని చెప్పదగును.

## రాజకీయ పరిస్థితులు

రాజమహేంద్రవరము రాజధానిగా పూర్వాంధ్రదేశమును చాళుక్యచక్రవర్తులు రాజ్యము చేయుచుండగా వారికి లోబడి వర్తక స్థానము లెన్నియో ఆంధ్రదేశమున నితర ప్రాంతము లందువలె వెలసెను. అట్టి వర్తకస్థానములే పెనుగొండ మొదలైన నగరములు. శ్రీ వాసవకన్యకాపురాణాది గ్రంథము లందును, తత్సమకాలిక శాసనము లందును పెనుగొండ మొదలగు 18 నగరములకే గాక, తదితర పురములందును వైశ్యులు నగర పాలకులుగా నుండినట్లు తెలుపబడినది. ఈ ఆంధ్రదేశ మందలి వైశ్యనగర రాజ్యములు, పాశ్చాత్యదేశములందు క్రీ శ 10,12 వ శతాబ్దముల వరకు, అందందు వెలసియుండిన రోమక, గ్రీకు, ఫ్లారెన్సు మొదలైన పాశ్చాత్య నగరముల వంటివని తెలియును.

ఈ మన నగర రాజ్యములు గూడా "ఏథెన్సు" మొదలగు నగర రాజ్యములవలె ప్రజాపరిపాలిత రాజ్యములుగా నుండెను. ఒక్కొక్క నగరమున కొక్కొక్క రాజ్య సంస్థయుండెను. ఏథెన్సు నగర రాజ్యమునకు తదితర నగర రాజ్యములు కొన్ని లోబడి యుండినట్లే పెనుగొండ నగర రాజ్యమునకు మిగిలిన 17 పరిసర నగర రాజ్యములు లోబడి యుండెను. పెనుగొండ నగర పాలకులుగా బేర్వడసి, ఆ నగర పాలకులుగా బట్టాభిషిక్తులైన విరూపాక్ష, కుసుమశ్రేష్ఠులు. ఆ నగర వాసులగు వైశ్యులకును, తదితర కుల జులకును కూడా యిష్టులైనవారు. వారు ఏ కార్యము చేయవలయునన్నను దమ వారినెల్ల సభగూర్చి ఆ సభాభిప్రాయమును

బాటించుచుండిరి విష్ణువర్ధన రాజేంద్రునకు దమ కన్యక నీయవచ్చునా? కూడదా? అను విషయమును గురించి, తీర్మానించుటకు గాను పదునెనిమిది పట్టణములందలి వైశ్యులు పెనుగొండ పట్టణమున కాహ్వానించి సభ గూర్చిరి. చూడుడు.

మహత్కార్యం జాతమితిఃలిఖిత్వా
పత్రికారహ
సమయాంతు కులాచార । నిశ్చయార్థ
మితిస్ఫుటం॥
... ... ....
తేషా మాతిధ్య సత్కార్యం । కృత్వా
దేవస్సమంటపే
స్థిత్వాతైస్స హతత్కార్యం । సమస్తం
ప్రోచురాదితః

(వా.క.పు. షష్టమాధ్యాయః శ్లో.2 నుండి 5)

ఈ సభలు గ్రీకు నగర రాజ్యమందలి "ఎక్లిసియాహ" అను సభను బోలియుండును. ఎందుకనగా - "ఎక్లిసియా" శబ్దమిప్పటికి క్రైస్తవ మతాలయ సాంబధికమగు "ఎక్లిసియాస్టికల్" అను పదమునకు మూలమగుటచే నీ వైశ్య సభల వలె ఎక్లిసియా కూడా మతాలయ సమావేశముగల్గి, తదావేశపూరితములై యుండెననవచ్చును. కనుకనే నగరేశ్వర బిరుదు గల్గిన వారు ఆలయ నివాసి యగు వొక కులదేవతగా నెన్న బడుచుండెను. పరిపాలనకార్యముల నిర్వహించు కుసుమ శ్రేష్ఠ్యాదులు కేవలము శ్రేష్ఠి బిరుదము గల వారు మాత్రముగానే యుండిరి. అనగా నగరవాసులందు శ్రేష్ఠులని యర్థము. వీరికి రాజబిరుదము లేదు. వీరు పూర్వకాల మందలి పాశ్చాత్య 'రోమక' నగర రాజ్యపాలనము జరుపుచుండి "కన్సల్సు" అను వారిని బోలియుండిరి

పాశ్చాత్య నగర రాజములందీ సభలకు స్వతంత్ర జనులు మాత్రమే హాజరగుటకు అధికారము గల్గియుండిరి బానిసలకట్టి అధికారము లేకుండెను అదే రీతిగా నీ వైశ్య నగర రాజ్యము లందు వివిధ కులముల వారు నివసించుచుండినను, వైశ్యులు మాత్రమే నగరము వారని పేర్కొనబడి, ఆ నగర సభలందు పాల్గొను సభ్యాధికారము గల్గియుండిరి. అందు వల్లనే వర్తమానాంధ్ర దేశమున కూడా ప్రతి పట్టణ మందును, కన్యకాపరమేశ్వరీ దేవాలయ మొండు వెలయుటయు, నా దేవాలయమున వైశ్యకుల సభలు జరుగుటయు, వైశ్యసంఘమున కొక్క శ్రేష్ఠి అను పెద్దయుండుటయు, వైశ్యులెల్లరు నగరము వారని పేర్కొన బడుటయు వాడుక యందున్నది. పాశ్చాత్య నగర రాజ్యము లందువలె (బానిస జాతులవలె) వైశ్యేతరజాతులవా రీ యాంధ్రనగర రాజ్యములం దానాడు నగరమువారగు వైశ్యులను నమ్ముకొని, వారి(యనుచరులై వారికి వలయు నూడిగముల గావించి) తో జీవనము గావించుచుండిరి. విష్ణువర్ధన రాజేంద్రుని నుండి యాపద సంభవింప నున్నప్పుడు పెనుగొండ నగరమందలి వైశ్యేతర జాతుల వారు వైశ్యుల కెట్లు సాయపడిరో తెలియగోరిన వారు కన్యకా పురాణముఃజదివిన బాగుగా విశదము కాగలదు. ఈ నగరము వారును అట్టి తమ యనుచరులకు (వైశ్యేతర జాతులవారికి) తగిన జీవనాధారములను గల్గించి, వారికి వలయునపుడు పసదనములిచ్చి తమ

ప్రేమ సూత్రములచే వారిని గట్టి యుంచుచుండిరి. ఈనాడు గూడా ఆంధ్రదేశ మందలి పెక్కు నగరములందు వీరముష్టి, మైలార్లు మొదలగు పేర్లు గల పలువురి రీతిగా నొక కులాచారముగా నీ వైశ్యనగరము వారి నాశ్రయించి వారిని బొగడుచు, వారిచ్చు వార్షికాశనము వలన జీవనము గడుపుట జూడనగును.

ఆ కాలమందలి వైశ్యులిట్లు రాజులుగను, పరిపాలకులుగ నుండుయే గాక యుద్ధవిశారదులుగా గూడా నుండి రనుట కనేక శాసనాధికారములు గలవు. కీ.శ 9వశతాబ్దమున వీరి శెట్టి కొడుకు శ్రీకంకిలైదుంబమహారాజు సేనలను తిరు వలయుద్ధమునకు నడిపి, యుద్ధ మందు వీరస్వర్గ మందినట్లు చిత్తూరు జిల్లా ఆవేటి పల్లెలోని యొక శాసనము దెలుపుచున్నది. (శ్రీ వి. రంగాచారి గారిచే వ్రాయబడిన చిత్తూరు జిల్లా శాసనము నెం. 148) క్రీ.శ 1118 వ సంవత్సరమున గాంధారాధిత్యశెట్టియను వైశ్యుడు కోయంబత్తూరు జిల్లా యందొక సామంతరాజుగా నుండినట్లును, అతనికి "అధిరాజక్కాండియదేవ" అను బిరుద మున్నట్లును పరకేసరివర్మ వీరచోళదేవుని కాలమందలి యొక శాసనము వలన దెలియుచున్నది. (శ్రీ వి రంగాచారి గారిచే వ్రాయబడిన కోయంబత్తూరు శాసనము నెం.444) క్రీ.శ 1148సంవత్సరపు ద్రాక్షా రామ భీమేశ్వరాలయ మందలి శాసన మొకటి పెనుగొండ భీమశెట్టి కొడుకు ప్రోలిశెట్టిని "భండనభీమ" అని పేర్కొను చున్నది.( వాసవీ 2వ సంపుటం 10 సంచిక) క్రీ.శ 1149 వ సంవత్సరపు గుంటూరు జిల్లా శాసనమొకటి 1132 నుండి 1163 వరకు ఆంధ్ర దేశమందలి వెలనాడు ప్రాంతమును బాలించిన వెలనాటి చోడ రాజగు రెండవ గొంకరాజుకడ కన్నిశెట్టి యను వైశ్యవీరుడు సేనాధిపతిగ నుండి నట్లు దెల్పుచున్నది. (శ్రీ వి. రాంగాచారి గారిచే వ్రాయబడిన బాపట్ల శ్రీ బావ నారాయణ దేవస్థానం శాసనం నెం.420) ఇంతే గాకుండా శ్రీనాధవిరచితమగు హర విలాసమున తత్కృతి నాయకుడగు అవచి తిప్పయ్య సెట్టి "సంగరపార్థ" "సమర ఫల్గుణ అని సంబోధింపబడి యున్నాడు. అంతయేల ఈ హర విలాసమందు అవచి తిప్పయ్య సెట్టి గారి వంశమునకు మూల పురుషులలో ప్రఖ్యాతి గాంచిన వారిలో నొకడుగా శ్రీనాధుని హరివంశమున బేర్కొనఁబడిన చిరుతొండనంబి చారిత్ర కముగా 7 వ శతాబ్దమున కంచి రాజధానిగా రాజ్యమేలిన పల్లవరాజగు నరసింహ వర్మకడ ప్రధాన సేనాధిపతి గానుండెను క్రీ.శ1405వ సం॥రపు అనంతపురం జిల్లా శాసన మొందు, పామిడి భైరిశెట్టి కూతురు, ఆమెభర్త యుద్ధమునందు చనిపోగా పెనుగొండలో నామె అగ్ని ప్రవేశమైనట్లు చెప్పబడినది. (వాసవి భగంతం గుప్త గారి శాసనములు. 2వ సంపుటం -11వ సంచిక) గ్రీన్ హిల్ అను ఇంగ్లీషు ఏజంటు మద్రాసు నుండి 1657 వ సం॥రం జూన్ 28వ తేదీని వ్రాసిన ఒక లేఖలో ( ఇంగ్లీషు ఫేబ్రీస్ 1661 - 64 పేజి 382 ) శ్రీ రంగరాయలకు కోనేరు సెట్టి అను వైశ్యుడు సేనాధిపతిగా నుండినట్లు వ్రాయబడినది.

(ఇంకా ఉంది)

## అభాగ్య వైశ్య సోదర సహాయ నిధి రిజిష్టర్డు

వైశ్య ప్రబోధినీ కార్యాలయం

7/512-1 జయనగర్ కాలని, కడప - 516 002

**1-4-1992 నుండి 31-3-1997 వరకు అందించిన ఆర్థిక సహాయము**

| | | రు. పై |
|---|---|---|
| 16.06.92 | డి.వి.యన్. శ్రీరామమూర్తి, బి.ఇడి (విజయనగరం) | 200 00 |
| 30 06.92 | జె. సుధామణి, II బి.టెక్ (జమ్మలమడుగు) | 300.00 |
| 23.11.93 | యం. సౌభాగ్యలక్ష్మీ, బి.ఇడి (ప్రొద్దుటూరు) | 250.00 |
| | యం. మాధవి, III బి.ఏ (ప్రొద్దుటూరు) | 250 00 |
| 27.06.95 | ఎ. రవికుమార్‌గుప్త, 8వ క్లాసు (గుంటూరు) | 150.00 |
| | ఎ. మురళీమోహన్ గుప్త, 9వ క్లాసు (గుంటూరు) | 150 00 |
| 11.07 95 | యం. మాధవి, బి.ఇడి (ప్రొద్దుటూరు) | 300 00 |
| | యం.సౌభాగ్యలక్ష్మీ, బి.ఇడి (ప్రొద్దుటూరు) | 300 00 |
| 20.7.95 | పి. సుబ్బరాయుడు, రిటైర్డ్ టీచర్, కడప | 1,000 00 |
| 11.12.95 | ఐ. కిరణ్ బాబు, బి టెక్. సివిల్ (వరంగల్) | 500.00 |
| 05 01.96 | యం.యస్ ఎ.వి ప్రసాద్ ఎం.సి.ఎ (పరచూర్) | 500.00 |
| 29 11..96 | యం. మల్లమ్మ, జీవన భృతికి (వేముల మండలం) | 500 00 |
| 26 12.96 | వి వెంకటలక్ష్మమ్మ కుట్టుమిషను కొనుటకు (ప్రొద్దుటూరు) | 2,500.00 |
| 09.12.96 | యం.యస్.ఎ.వి. ప్రసాద్,యం.సి.ఎ (ప్రొద్దుటూరు) | 500.00 |
| 01 01.97 | వై.నాగరాజు, యం.సి.ఎ.కొరకు (ఒంగోలు) | 500.00 |
| 01.01.97 | జి.సుబ్బారావు, యం.సి.ఎ. కొరకు (వరంగల్) | 500.00 |
| | మొత్తం రూ. | 8,400.00 |

**01.04.95 నుండి 31.03.96 వరకు**

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| ప్రారంభపు నిల్వ | 20,260.15 | బీదవిద్యార్థులకు సహాయం | 1,900.00 |
| వడ్డీ ఖాతా జమ | 3,372.95 | బీద వైశ్యులకు ఆర్థిక సహాయం | 1,000.00 |
| ఆంధ్రాబ్యాంకి ఖాతా | 593.45 | యం.ఒ. కమీషన్ ఖర్చు | 66.00 |
| | | పోస్టేజి ఖర్చు | 35.00 |
| | | ఆంధ్రాబ్యాంకి ఖాతా ఖర్చు | 617.45 |
| | | అంత్య నిల్వ | 20,608.10 |
| మొత్తం రూ. | 24,226.55 | మొత్తం రూ. | 24,226.55 |

**01.04.96 నుండి 31.03.97 వరకు**

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| ప్రారంభ నిల్వ | 20,608.10 | బీదవిద్యార్థులకు సహాయం | 1,500.00 |
| ఆంధ్రాబ్యాంకి | 617.45 | బీదవైశ్యులకు ఆర్థిక సహాయం | 3,000.00 |
| వడ్డీ ఖాతా జమ | 3,513.35 | యం.ఒ. కమీషన్ | 75.00 |
| | | పోస్టేజి ఖర్చు | 20.00 |
| | | ఆంధ్రాబ్యాంకి ఖర్చు | 645.45 |
| | | అంత్య నిల్వ | 19,498.45 |
| మొత్తం రూ. | 24,738.90 | మొత్తం రూ. | 24,738.90 |

## ప్రస్తుత కాలంలో మీ వలె మృదువుగా మంచి భాషలో వచన, రచన చేయగల వారు వైశ్యులలో లేరు.

పూజ్యమిత్రులు, శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్టి గారికి అనంతశుభోదయములు.మీ ఆకాశ వాణి ప్రసంగాలలోని 'కరుణకవి కరుణశ్రీ' వ్యాసమును ఏప్రియల్ వైశ్యప్రభోదినీ పత్రికలో చదివాను, ఆ వ్యాసము చాలా బాగున్నదీ ఎన్నో పద్యాలను మీరు పలుమారులు పఠించి అనుభవించి ఆ వ్యాసమును హృదయంగమంగా చిత్రించి యున్నారు. నా చిన్నతనం నుండీ కరుణశ్రీ గారి పద్యాలను పఠించి యుంటిని. హరికథలలో ప్రవచనములలో ఎన్నో పర్యాయములు గానంచేసి యుంటిని. సుమారు 20 సంవత్సరాల క్రిందట శ్రీజంధ్యాలపాపయ్యశాస్త్రి గారు తరచుగా విజయవాడకు వచ్చుచుండే వారు. వచ్చి నప్పుడల్లా శ్రీ మునికొండ కాశీవిశ్వనాధము గారి షాపులో కొంత సమయం గడిపేవారు. అప్పుడప్పుడూ నేను వారిని కలిసికొని హృదయంలోనే వారికి కృతజ్ఞతలను అభినందనలను తెలుపుకొనే వాణ్ణి. శ్రీ శాస్త్రి గారు నాతో చమత్కారంతో ప్రీతితో మాట్లాడు చుండేవారు. ఆయన అమరకవి. ఆయన కవిత్వధార జీవధార. ప్రస్తుత కాలములో మీవలె మృదువుగా మంచి భాషలో వచన, రచన చేయగల వారు వైశ్యులలో లేరనే అభిప్రాయపడుచున్నాను. దైవదత్తమైన మీ భాషను, రచనను ఇదే విధముగా ఎల్లకాలము ఆంధ్రజాతికి అందించగలరిని ఆశించు చున్నాను.

-గర్రె సత్య నారాయణగుప్త, విజయవాడ

## ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు కనువిప్పు కలిగేదెప్పుడు?

భారతదేశములో కూడా మసీదులు, వారి ఆస్తుల పరిరక్షణకు వక్ఫ్‌బోర్డులు నియమించి, ఆదాయములేని మసీదులకు ప్రభుత్వమే ఆర్థిక వనరులు సమకూర్చాలని ఆ మతస్థులు పోరాడుతూ ఉంటే ప్రజాసంస్థగా ధృవీకరింపబడిన సీతమ్మ ఆస్తులను అన్యాక్రాంతం చేయదలచిన అధర్మకర్తలకే మహాసభపాలకవర్గము ప్రత్యక్ష, పరోక్ష మద్దతును పదేళ్ళుగా ఎందుకు తెలుపుతోంది. నూతన అధ్యక్షులైన జయం సుబ్రమణ్యం గారు కూడా ఎన్నికయిన మరుక్షణమే మాజీ అధ్యక్షుల అడుగుజాడల్లో నడుస్తానని ప్రకటించడము వైశ్యజాతి ప్రగతికి అవరోధకులుగా అయినట్లు గాదా? అంటూ చిత్తూరు జిల్లా అవోపా అధ్యక్షులు కె. సత్యం, తిరుపతి అవోపా అధ్యక్షులు శ్రీ పి. మల్లి కార్జునశ్రేష్టి, తిరుపతి అవోపా ఉపాధ్యక్షులు శ్రీ యన్. గంగాధరశ్రేష్టి గారలు 30.05.1997 న ఒక పత్రికా ప్రకటనను విడుదల చేశారు

## విజయవాడలో అష్టోత్తరశత హోమకుండ క్రతువు

విజయవాడ పట్టణములో శ్రీ కాకరపర్తి భావనారాయణశ్రేష్ఠి కళాశాల ఆవరణములో 24-4-97 నుండి 5-5-97 వరకు 9 రోజులు అష్టోత్తరశత (108) మహాకుండక్రతువు జరిగింది. శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్రసంఘము వారి ఆధ్వర్య ములో ఈ క్రతువు జరిగింది. శ్రీ శివ చరణబ్రహ్మచారి గారు ఈ క్రతువును, నిర్వహించారు. శ్రీకృష్ణానందగిరి స్వాములు మాతృశ్రీ ప్రేమానందగిరి అమ్మగారు, ప్రభృతులు ఈ క్రతు కార్యక్రమములో పాల్గొన్నారు. 108 హోమగుండములలో శ్రీదుర్గ, శ్రీవాసవీ ఇత్యాదిగా తొమ్మిది నామములతో తొమ్మిది రోజులు ఈ కార్యక్రమం జరిగింది. ఆధ్యాత్మికోపన్యాసాలు, భజనలు, లలితాసహస్ర పారాయణాదులు ఈ క్రతువు కార్యక్రమములో భాగంగా జరిగాయి.

రైతులోకానికి మా శుభాకాంక్షలు

మీ పొలాల్లో పెరిగే పైర్లకు
వచ్చే తెగుళ్ళకు

**మా " జ్యోతి బ్రాండు " మందులనే వాడండి**

మాచే తయారుచేయబడే గెమాక్సిన్ 5%, 10%, B.H.C. 10% Dust & 50 % WDP, Malathion 5% Dust & 50% EC, Endosulphan 35% EC, Monocrotophos 36% WSC, Quinolphos 25% EC, Dimethoate 30% EC, Methyl Parathion 50% EC, Cypermethrin 10% EC, Fenvalrate 20% EC, మొదలగు క్రిమిసంహారక మందులు దేశవ్యాప్తంగా ఉపయోగించబడి తెగుళ్ళ నివారణకు అమోఘంగా పనిచేయుచున్నవి.

**ఆదిత్యా మినరల్ ట్రేడర్స్**

కొండాపురం (R.S.) కడపజిల్లా. PIN - 516 444

**Vasavi**

**వాసవి**

వైర్లు మరియు పైపులు





**నాణ్యతకు, మన్నికకు, పేరెన్నిక గన్నవి**

తయారుచేయు వారు :

వాసవీ ఇండస్ట్రీస్
18/638 - బి, గుత్తిరోడ్,
గుంతకల్ - 515 801

**VASAVI INDUSTRIES**
18/638-B, Gooty Road,
GUNTAKAL - 515 801

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రీకులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8 2 1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5 11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది

ఈ అన్నదాన సంఘానికి

రూ 10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ 2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.6.97 నుండీ 20.7.97 వరకు)

ఆదాయపుపన్ను చెల్లించు అసెసీలు నాలుగు వర్గాలుగా చట్టములో పేర్కొనబడినారు. అందులో మూడవ వర్గము "ఇతరులు". జీతములు, ఇంటిబాడుగలు వగైరా మాత్రమే ఆదాయముగాకల అసెసీలు ఈ ఇతరుల వర్గమునకు చెందుతారు. మీరు ఈ ఇతరుల వర్గమునకు చెందే అసెసీలా? అయితే మీరు మీ ఆదాయపుపన్ను రిటర్నును మీకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు ఈ (జూన్) నెల ౩౦వ తేదీయే చివరిది. సవరించిన ఆదాయపుపన్ను చట్టము ప్రకారము పై జూన్ ౩౦వ తేదీ లోగా రిటర్నును దాఖలు చేయని వారు సదరు రిటర్నును దాఖలు చేయుటకు వ్యవధిని కోరుటకు గతములోలాగా ఇప్పుడు అవకాశంలేదు. ఈ విషయాన్ని సదా మీరు గుర్తుంచుకోవడము అవసరము.

**1996-97లలో మీరు ఎవరికైనా రూ. 30,000/- లకు మించి బహుమతి (గిఫ్టు) ఇచ్చారా?** అయితే మీరు ఈ జూన్ నెల ౩౦వ తారీఖులోగా చేరునట్లుగా అందుకు సంబంధించిన అధికారికి మీ **గిఫ్టుట్యాక్సు రిటర్నును** తప్పక పంపాలి. మరువవద్దు.

పదవీవిరమణ చేయు ఉద్యోగులకు 1997 మేనెలలో చెల్లించిన **జీతములు, ఆజీతములలో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలనుతెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెం.21ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ (జూన్) నెల ౩౦వ తేదీలోగా చేర్చాలి.**

**ఆదాయపుపన్నుచట్టములోని 192వ విభాగము క్రింద జీతములలో పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలనుతెలుపు "అన్యువల్‌రిటర్ను" అనగా 24వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ (జూన్) నెల ౩౦వ తారీఖులోగా చేర్చాలి.**

**ఇప్పుడు సరికొత్త గెటప్‌లో**

అందమైన, ఆకర్షణీయమైన కంప్యూటరైజ్డ్ కంపోజింగ్ & మల్టీకలర్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో

**ప్రతి వైశ్యుని ఇంట్లో ఉండవలసిన పుస్తకాలు**

- వైశ్య వైజయంతిక (వైశ్యప్రబోధినీ రజతోత్సవ సంచిక) రు.100/-
- శ్రీ వాసవీ వ్రత కల్పము రు.25/-
- వాసవి (శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవి చరిత్ర) (నవలా రూపం) రు.15/-
- శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ (వేదోక్త) పూజావిధానము రు.5/-
- సంధ్యా వందనము (క్రియతో కూడ) రు.5/-
- శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ శతోత్తర, సహస్రనామావళి రు.5/-
- వైశ్యులు - శాఖలు - పర్యాయ పదాలు రు.5/-

● పోస్టేజి అదనం. ● పూర్తి సెట్ (7 పుస్తకాలు) తెప్పించుకొనే వారికి పోస్టేజి ఉచితం. ● పుస్తక విక్రేతలకు 25% కమీషన్ గలదు

"వైశ్య ప్రబోధిని పబ్లికేషన్సు", 'వాసవీ భవన్'
7/512-1, జయనగర్ కాలనీ, కడప - 516 002. ఫోన్స్ : 25025, 24911

PHILIVISION CT 2070



PHILIVISION
Colour TVs
PHILIPS

Authorised PHILIPS Dealers

Office : 6044
Resi : 6863

VASAVI GENERAL TRADERS
GUNTAKAL.
PIN-515 801

శరీరంలో శక్తికి, సంసారంలో అనురక్తికి ! ప్రతిరోజు 2 క్యాప్సూల్స్
పాలతో సేవించండి.

# ఓజోమెన్ క్యాప్సూల్స్






* ఆనందంగా, ఆరోగ్యంగా జీవించటం మీకిష్టమైతే
* మీ శ్రీమతిని మరింతగా ప్రేమించటం మీకోర్కైతే
* తరిగిపోని యవ్వనశక్తి మీకు కావాలంటే
* సుఖమయ దాంపత్యజీవితం మీ ధ్యేయమయితే

అప్పుడు మీకు కావలసినది ఓజోమెన్ క్యాప్సూల్స్
ఇది ప్రకృతి ప్రసాదిత వనమూలికలు మరియు ఖనిజముల మిశ్రమము. ఎంతకాలమైనను వాడవచ్చును. పథ్యంలేదు. ఎటువంటి దుష్ఫలితాలు ఉండవు.

ఇంకా వివరములు తెలుసుకొనగోరినవారు ఈక్రింది అడ్రసుకు ఒక పోస్టుకార్డు వ్రాసిన చాలు వెంటనే సమాచారం తెలుస్తుంది.

తయారుచేయువారు
**ఫివికెమ్ లేబరేటరీస్**
పోస్టుబాక్సు నెం : 64
విజయవాడ - 520 001

మార్కెట్ చేయువారు
**స్టెర్లింగ్ రెమిడీస్**
PO బాక్సు నెం : 194,
విజయవాడ - 520 001

ప్రముఖ అన్ని మందుల షాపులలో లభ్యం



LICENSED TO POST WITHOUT PREPAYMENT
[illegible] /69. Postal Regd. No. [illegible]

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.